





రాజకీయములు ౭

# ధార్మిక విప్లవము

అనువాదకుడు - గుంటుపల్లి శీతారామయ్య

ప్రకటన కర్తలు :
నమ్మాళ్వార్స
పోస్టు బాక్సు ౨౫౧
మద్రాసు
౧౯౩౮



వెల ఆరు అణాలు
లేక ఒక షిల్లింగు

# ధార్మిక విప్లవము




గ్రంథకర్త:
గుంటుపల్లి సీతారామయ్య.

నమ్మాళ్వార్స్
౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి,
పోస్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.

సర్వస్వామ్య సంకలితము. ౧౯౩౮ వెల ఆరు అణాలు, లేక ఒక షిల్లింగు

ఈగ్రంథమునందలి పంద్రెండువ్యాసములును వివిధవిషయములకు చెందినవి. వానిని వివిధరచయితలు వివిధకాలములందు లోకమునకు చేకూర్చిరి. స్థూలదృష్టికి సంబంధరహితములుగను- పరస్పరభిన్నములుగను కనబడుచుండు ఈవ్యాసములను సూక్ష్మదృష్టితో పరికించినచో వాని యన్నిటిని సూత్రిత మొనర్చు ఐక్యభావము పొందికగా పొడగట్టును. ఈవ్యాసములందు ప్రస్తావితవిషయములన్నియు జీవితరంగమున కనుస్యూతములయినవే. అందు తటస్థితములగునవే. పురుషార్థములుగ నెంచబడుచున్నవే.

సంసారమున చతికిలబడనివాడు, రాజకీయములలోనికి రానివాడు, కవుల భావములలో కరుగనివాడు, అందమును జూచి ఆనందించనివాడును జగితిలో లేడుగదా !

సజ్జనుల సల్లాపములే, సత్కవుల భావములే కష్టభూయిష్ఠమగు సంసారమున సంతోషకారణములని జెప్పిన ప్రాజ్ఞుడిని అనుభవములోనికి దెచ్చిచూపుటకు జ్ఞానదీపికలు ఈ వ్యాసములు. వ్యక్తిజీవితమం దడుగడుగునకు కలుగు సందియములు, సంఘట్టనలు మెలకువతో తొలగింపబడకున్న 'ఇంతింతై వటు డింతయై' అన్నట్లు సర్వనాశనకరములగును. అట్టి ఆపదను అరికట్టగల, నివారింపగల సామర్థ్యము ఈవ్యాసములకు కలదనుభావముతో — ఆంధ్రమహాజనులకర్పించుచున్నాము.

అనువాదకులు — గుంటూరుమండలము పెదపాలెముగ్రామములో 'సేవాశ్రమ' కార్యనిర్వాహకులు- గుంటుపల్లి సీతారామయ్యగారు. యువకులు, ఉత్సాహులు, వ్యుత్పన్నులు. తెలుగుతల్లికి వెలుగుల గూర్చుటలో శ్రద్ధగలవారు.

వ్యాసకర్తలకు - అనువాదకులకు - మాయభివందనములతో -

సంపాదకుడు.

---

[విషయసూచిక ౭౩-వ పుట.]

# ధార్మిక విప్లవము

## ౧
## ఇది విప్లవయుగము

"ఇది విప్లవయుగము......లోలోపల ఘోర మంథనము జరుగుచున్నట్లు స్పష్టముగ కన్పట్టుచున్నది. అందువలన నొక నూతనసృష్టినిర్మాణము కాబోవుచున్నది."

ఇది విప్లవయుగము. అదిగో విప్లవము వ్యాపించుచున్నది. కేవలము భారతదేశమందేగాదు. అది తన సువర్ణరేఖలను సర్వత్ర వ్యాపింపజేయుచున్నది. లోలోపల ఘోరమంథనము, ఒక నూతనసృష్టి, ఒక నవీననిర్మాణము జరుగుచున్నట్లు స్పష్టముగ గోచరించుచున్నది.

భారతీయాత్మ యిపుడు విప్లవపూరితమైయున్నది. విప్లవము ప్రపంచమునంతను తలక్రిందులుగావించుచున్నది. అది రాజకీయనైతికజీవితమందు సామ్రాజ్యవాదమును బూటకమొనర్చి రాజుల మహారాజుల సత్తాను నామమాత్రావశిష్టమొనర్చినది. రష్యాచక్రవర్తియగు జారు నేడు ప్రపంచమున రూపురేఖలులేకుండ నశించినాడు. ఇంగ్లండు జపాను రాజులిపుడు ప్రజల ప్రభువులు

గాదు. వారిపుడు ప్రజాసేవకులు. ఈస్వాభావికరూపము ననే వారికముందుండ వీలుపడును. మనదేశపురాజులు మహారాజులు ఈ విప్లవమునుజూచి గజగజలాడుచున్నారు. దూరదృష్టిగల బుద్ధిమంతులు దీని నవగతమొనర్చుకొని స్వల్పముగనైనను తమ యాచరణయందు బెట్ట నుత్సాహము జూపుచున్నారు. అందు ప్రజాహితము లేశమాత్ర ముగనే యుండుగాక ! అనుభవయత్నమునను న్నవారు జాగృతినందియుందురు. ఈవిప్లవోషఃకాలమందు ప్రజలు జాగరూకులై సహయోగమందు, సంఘటనమందు నిమగ్నులై యున్నందున ప్రజలమధ్యను, ప్రభువులమధ్యను నుండు సంబంధము తోడేలు గొఱ్ఱెల సంబంధమును బోలి యుండజాలదు. ఇకముందు ప్రజలు పాలకుల అడుగులకు మడుగులొత్తుచు పడియుండక తమ బాగోగుల తెలిసికొను సామర్థ్యముగల్గియుందురు. ఏకతంత్రమునకు బదులు ప్రజాతంత్రము సర్వత్ర వ్యాపించుచున్నది. విశాల సామ్రాజ్య నిర్మాణము, దుర్బల దేశముల జయించి నిలువు దోపిడిచేసి దానిపై తమ యాధిపత్యమును నెలకొల్పుట అసురప్రవృత్తిగ నెంచబడుచున్నది. కావున సామ్రాజ్య వాదమున కికముందు ప్రపంచమున నిలువనీడయుండదు. అల్పసంఖ్యాకుల ఆమోదప్రమోదములకై బహుసంఖ్యాకుల యోగక్షేమముల పాటించకుండు ప్రవృత్తి యడుగంటి బహుజనప్రయోజనార్థము అల్పసంఖ్యాకులు తమ ఐశ్వర్యమును అర్పింపవలసిన కాల మాసన్నమైనది.

### సామాజిక ధార్మిక క్షేత్రములు

సామాజిక ధార్మిక క్షేత్రములయందలి మిథ్యావాద

మును పటాపంచలుగావింప విప్లవము తత్పరత వహించి యున్నది. ఇకముందు ధన, బల, మదముచే సజ్జనుల నష్ట కష్టముల పాలుజేయకుండ చేయగల సుదిన మాసన్నమై యున్నది. ధనబలమదముల నంతరింపచేసి న్యాయనీతి ప్రేమ లాస్థానము నాక్రమింపగోరుచున్నవి. ఇక ధనికులు బీదలయెడలను, పాలకులు పాలితులయెడలను తమ విశుద్ధ కర్తవ్యములందు జాగరూకులై మెలంగవలసియుండును. ప్రపంచమునుండి పూంజీవాదము, సైనికవాదము, సత్తా వాదము మొదలగునవి యంతర్ధానమై సమతావాదము, జనతావాదము, శాంతివాదము మూలమూలల వ్యాపింప బోవుచున్నవి, ఇందులకు యూరపునందు కమ్యూనిజము, భారతదేశమున గాంధీయిజము తార్కాణములు. నేడు ధనవంతులకు, పురోహితులకు, పౌరాణికులకు, ధర్మగురువు లకు, మఠాధీశ్వరులకు చెడుగ్రహములు. దళిత పీడిత పతిత దుర్బల కార్మిక కర్షకులకు, అస్పృశ్యులకు, స్త్రీలకు మంచి గ్రహములు పట్టినట్లు కన్పట్టును.

### ఆర్థిక ప్రపంచము

ఆర్థిక ప్రపంచమున విప్లవమేఘములు దట్టముగ వ్యాపించియున్నవి. వ్యాపారము, ఉద్యోగము, ఇతరుల పిండి పిప్పిచేయుటకుగాక దేశమునకు మానవజాతికి హిత ముకలిగించుట కనుభావము ఎల్లెడల వ్యాపించుచున్నది. ధన మికముందు ఒకచోట ప్రోగై తుప్పుపట్టిపోక సర్వ జన సులభమై వారి సౌఖ్యమునకు తోడ్పడును. బుద్ధి బలమువలనను, జ్ఞానవిక్రయము వలనను ధనము నార్జిం చుట శ్రేష్ఠముగా నెంచబడక చెమటోడ్చి కష్టించి పొట్ట

బోసికొనుటయే ధర్మముగా నెంచబడును.

## సాహిత్యక్షేత్రము

సాహిత్యము, కావ్యము, కళ విప్లవప్రభావములు సోకకుండ దూరముగ నుండజాలవు. విప్లవము అందును ఉపద్రవమును కలిగించుచున్నది. సాహిత్యసేవ యిక ముందు మనోరంజనకు, ఆమోదప్రమోదములకు, పొట్ట నింపుకొనుటకు ఉపయోగపడు వస్తువుగానుండక ఆత్మ నివేదనమునకు ఆత్మవికాసమునకు తోడ్పడును.

ఇట్లు నలుదిశలను విప్లవము, విప్లవమందలి పరమాణువులు వ్యాపించుచున్నవి. మనము కోరినను, కోరకపోయినను, మంచిదని తలంచినను, చెడుదని భ్రమించినను ఈసర్వతోముఖమగు విప్లవము అణుమాత్రమైన ఆలసింపదు. పురాతనుడగు ఈశ్వరుడుగూడ గుణదోష సహితుడై మనయెదుట ప్రత్యక్షమగుచున్నాడు. ప్రతి అణువు నూతనజీవముతో నవీనభవిష్యత్తును సృష్టించుటకు తత్పరత వహించియున్నది.

ఓ ప్రాచీనుడా! నీవిట్లెంతకాలము జీర్ణశీర్ణకళేబరముతో నిట్టూర్పులు విడుచుచు నిలువగలవు! జాగరూకుడవై బుద్ధినిమార్చి నూతననేత్రములతో, నవీనతేజస్సుతో కూడిన ఆసుందరరూపమును వీక్షించి ఉప్పొంగి ధన్యతజెందుము. నీవు వెఱగందనక్కరలేదు. అంతర్వస్తువదియేగాని బాహ్యరూపముమాత్రము నవీనము. ఇదియే విప్లవము.

---

౨

# దేశముకొఱకు ఉన్మత్తులుగండు

స్వరాజ్యముకావలెనా? మీకు. మీరు స్వతంత్రులు కాగోరుచున్నారా? విలంబనమును సైపజాలరా? అయిన అందులకై ఉన్మత్తులుకండు! అందు తన్మయత్వమునం దుడు!! మీరు ఉన్మత్తులా? నేడు భారతదేశమున స్వతంత్రతకై ఉన్మత్తులైనవారెందరున్నారు? ఉచితానుచిత విచారణ చెడ్డదికాదుగాని అది మనల నున్మత్తుల కాకుండ నిరోధించిన మనము రెంటికిం జెడిన రేవడుల మగుదుము.

భారతదేశ స్వరాజ్యప్రాప్తికి శాంతియుతమును అహింసాత్మకమునునగు ఆందోళనతప్ప అన్యకార్యక్రమమువలన స్వరాజ్యము లభింపదని నిశ్చయించితిమి. ఆనిశ్చయముతోనున్న మనకు స్వరాజ్యప్రాప్తి గలుగునా? తన్మయులమై మనమందర మా మార్గమున నడిచినపుడే అది ప్రాప్తించును. నలుబది సంవత్సరములనుండి మన మస్తిష్కములు స్వాతంత్ర్యముకొఱకు పోరాడెను. ప్రతిఫలము మనయెదుట ప్రత్యక్షముగనున్నది. శతసంవత్సరమస్తిష్కయుద్ధమువలనగూడ పోజాలనంతదూరము స్వరాజ్యమార్గమున ముందుకుపోతిమి. ఇక మస్తిష్కయుద్ధయుగ మంతరించినది. మస్తిష్కయుద్ధయుగమును దాటి మనమెంతయో ముందునకు వచ్చితిమి కాబట్టి తిరిగి దానినిగూర్చి చింతించుట వ్యర్థము. హానికరము.

ఇక మస్తిష్కమునకు విశ్రాంతినొసగి హృదయ పోరాటము సాగింతము. రణరంగమున హృదయప్రతాపమును ప్రదర్శింప వీలుగలిగింతము. మస్తిష్కయుద్ధము హృదయపోరాటము సాగుటకు సాయపడునదైనను అది స్వాతంత్ర్యయుద్ధ మనబడదు. స్వాతంత్ర్యయుద్ధము హృదయమువల్లనే జరుగును. ఉన్మత్తునిగానొనర్చుటకు, తన్మయుని గావించుటకు తగుశక్తి మస్తిష్కమునకులేదు. ఆ శక్తులు హృదయమునకుమాత్రమే యున్నవి. ముందుకు విజృంభింపజేయు శక్తి హృదయమందున్నది కాని మస్తిష్కమున లేదు. హృదయము యింజనువంటిది; మస్తిష్కము బ్రేకువంటిది. ఇవిరెండును లేక బండి గమ్యస్థానమునకు చేరదు. బండిని ముందుకునడుపుశక్తి యింజనుకు మాత్రమే యున్నది. ఇంజను చెడిపోయిన బ్రేకు బండిని ముందుకులాగజాలదు. హృదయము మనల నాశాపూరితుల గావించును. సాహసులగావించి, నిర్భయులుగా నొనర్చి నిజమగు వీరుల గావించును. మస్తిష్కము మనల పొరపడకుండ చేసినను మనకు తెలియకుండ మనలో పిరికితనమును వ్యాపింపజేయును. యోధులు రణరంగమున తమ హృదయమును దేవతగా తలంతురు. హృదయము వారియందు బలిదానశక్తిని ప్రబలమొనర్చును. అది వారిని స్వరాజ్య ప్రకాశముచే ప్రజ్వలిత మొనర్చి నిత్యనూతనోత్సాహములతో ప్రజ్వలింపజేయును. మస్తిష్కమందు వికాసమున్నది. హృదయమందు విప్లవమున్నది. మస్తిష్కము "నిదానముగా సావధానుడవై ప్రాణాపాయము లేకుండ చరింపుమ"ని చెప్పును. హృదయము—"దూకుము, ప్రా

ణత్యాగ మొనర్పుము; బ్రతుకు నిత్యముగాదు. ఎప్పు డైనను చావక తప్పదు. ఇట్టి సమయము తిరిగి లభింప దని" చెప్పెను.

భారతయోధులారా! మస్తిష్కయుద్ధముగావించు తలంపు మానుడు. అదిభ్రమ; మోసము; మాయ. హృదయపరమగు యుద్ధముగావింపుడు. హృదయమును ముందుకు సాగింపుడు. హృదయము ఉన్మత్తవంతమైనది. తన్మయత్వముతోగూడిన యొక "ఉన్మత్తహృదయము" రవి అస్తమింపని బ్రిటిష్ సామ్రాజ్యమును కదిలించివైచినది. మీరు ఉన్మత్తులు కాజాలరా? మస్తిష్కమును హృదయ పరమొనర్చు సామర్థ్యము మీయందు లేదా?

మీరు విప్లవపథమున నున్నారని గ్రహింపుడు. మీభావములయం దెంతగనో మార్పుగలిగినది. మీయందు అపూర్వజీవనశక్తి యుద్భవించినది. స్వరాజ్యమును మీ దృష్టిపథమున నిడికొనియున్నారు. ఇక మీచరిత్ర యందు విప్లవమును వ్యాపింపజేయుడి!

సాహసమే మీకిపుడు శరణ్యము. ధైర్యమే మీ ధర్మము. హృదయదేవియే మిత్రబృందము. మీమిత్రులకిది పరీక్షాసమయము ఇది పర్వతారోహణము. దీని పరిణామము ఆనందదాయకము. అత్యంత ఆహ్లాదకరము. స్వరాజ్యము ప్రాప్తించువరకు సుఖాభిలాష యనుమాట మఱచిపొండి. హృదయముపై చేయివైచికొని పరీక్షించి చూడండి. అందుండి ఉత్సాహ మినుమడించి ప్రవహించుచున్నది. అది రాత్రిందివములు కర్తవ్యబోధ గావించు

చునే యున్నది. వీరుడు "కార్యము కఠినమని, అందుచే తనవలనగాదని" ఎప్పుడు చెప్పడు. అట్లుచెప్పుట అమర్యాదగా నాతడెంచును. అంతియేగాదు ఆత్మహత్యగ గూడ తలంచును. అతడు మృత్యుముఖమున పడినపడుగాక! చేతగాదనిగాని, చేయలేననిగాని" పలుకడు. సిద్ధికొఱకాతడు తన ప్రాణముల నర్పింప సంసిద్ధుడై యుండును. అందులకై ఉన్మత్తుడగును. మనము నిజముగ స్వరాజ్యము కొఱకు ఉన్మత్తులమైతిమా? అందుకై నిద్రాహారముల త్యజించి రాత్రిందివములు పనిచేయుచున్నామా? అట్లు చేయుటే జీవితానందముగ నెంచితిమా? అందులకై ధన, మన, ప్రాణముల ఆనందపూర్వకముగ నర్పింపగల సామర్థ్యము మనయందున్నదా? మనకు స్వరాజ్యసంపాదనా చింత తప్ప అన్యచింత లేదా? కరాచి మొదలు కామరూపమువరకు, హిమాలయము మొదలు కన్యాకుమారివరకు గల దేశమును కదలించ ప్రతిజ్ఞబూనితిమా? సశక్తిపై నాధారపడి చేతినూలువస్త్రములనే ధరించుచు అన్యవస్త్రముల ధరింపమని శపథము గావించితిమా? అస్పృశ్యతను దేశమునుండి వెడలగొట్టి ప్రేమ, శాంతి, భ్రాతృభావము, క్షమ, ఉదార, సౌజన్యములతో మెలగ సమకట్టితిమా? అందు యేస్వల్పముగనైనను చేసియుండనిచో మనము స్వరాజ్యోన్మత్తులమని యెట్లు చెప్పగలము? అది యితరులు తెచ్చి నోటికందించు ఫలమా? అందులకై ఉన్మత్తతజెంది దేశముయొక్క సహాయోగమును పొంది పని చేయ సిద్ధపడుడు.

---

# 3
# భయము పెనుభూతము

పురుషులు నిర్భయులు, శూరులు ; కాని హింసకులై, క్రూరులై భయానకులుగానుండరు. హింస, క్రౌర్యము, భయానకత్వము పశుధర్మములు. మానవునిజూచిన భయమొదవగూడదు. ప్రేమ, అభయము, శాంతి అనుభవమునకు రావలయును.

కాని నేటి మానవసంఘము మనుష్యనామమును సార్థకపరుచునదిగలేదు. ఇంతవరకు మానవుడు నరపశువుగానే యున్నాడు. కాని మానవవికాసదృష్టితో- మానవుని మానసిక, ఆత్మిక, ఉత్కర్ష గుణదృష్టితో తక్కిన దేశములకన్న భారతదేశము అధికాభిమాన భాగిమైయున్నది.

కాని దానివికృతాంగముల వీక్షించినపుడు హృదయము కంపించును. నేడది దాస్యబంధనములబడి క్రుగ్గుచున్నది. దాని భాగ్యవిధాతలు సప్తసముద్రములు దాటి వచ్చిన స్వల్పసంఖ్యగల సంఘము. నేడు పౌరుషహీనమై యున్నదానిస్థితి గమనించిన అది జీవించియున్నదా ? లేక మరణించినదా ? అది శూరవీర నిలయమగు భారతమా ? లేక భీరనిలయమా? యను సంశయము గలుగును. భయప్రపూర్ణములైన దానియుగముల వీక్షించినపుడు "అహంబ్రహ్మాస్మి" "సోహమ్" అను తత్వముల ప్రచారము గావించిన మహాపురుషు లుద్భవించిన దిచటనేనా? యని శంకవొడమును మానవునకు పాపభయము, దైవ

భయము ఉండునుగాని మన వెనుక భయముగలిగించు వందలాది పెనుభూతములు తగుల్కొనియున్నవి. రాజ్య భయము, చోరభయము, లోకభయము, గురువులభయము, పోలీసులభయము, శస్త్రభయము, పరివారభయము, పొట్టభయము, దగాభయము, స్వామిభయము, స్వార్థ భయము, హానిభయము, మృత్యుభయము, రోగ భయము యివియవి యననేల సర్వభయములు ఆత్మను బలహీనమొనర్చి, మనల జీవచ్ఛవముల గావించినవి.

మనుష్యుడు—భయము అను నీరెండును పరస్పర విరుద్ధశబ్దములు. నరనారాయణాంశము గలిగిన—కాదు—స్వయముగా నరనారాయణుడైన వాని యెదుట భయము నిలువగలుగునా? అజ్ఞానమువలన భయము గలుగును.

నీ వీరహస్యమును తెలిసికోన గోరుచున్నావా? మానవుని కార్యశక్తి, వాని చమత్కారయుతములగు శక్తులను గుర్తింపగోరుచున్నావా? అయిన నిర్భయత్వము నలవరచుకొమ్ము. భయము పెనుభూతము. భూతమును స్మరించకు. అది నీవెంట తగుల్కొనును. భయము మానవ జాతికి అవమానకరము. భయపడుట, భయపెట్టుట మానవధర్మమునకు విరుద్ధములు. అవిరెండును పిరికితనమునకు భిన్నరూపములు. ఇతరుల భయపెట్టువాడు, ఇతరులపై భయప్రయోగము గావించువాడు స్వయముగా భయపడకుండ నుండజాలడు. అట్టివాడు ఆత్మోన్నత్యము నంద జాలడు. భయపెట్టుట పశుత్వము—భయపడుట అంతకంటెను నీచము.

కాని మనము భయపడవలసినవానికి భయపడనందుకు ఆశ్చర్యపడవలసియున్నది. మన పతనమునకు, అంతమునకు మూలబీజములగు వానిని మన మిత్రులను చేసికొంటిమి. మనుష్యసంఘమున నేడు పాపభీతి యెంత యున్నది? అన్యపాపములు పాపభయమును, ఈశ్వరభయమును పోద్రోలి అందు తావర మేర్పరుచుకొనినవి. మనుష్యుడా! చైతన్యముగలిగియుండుము. నేడు నీకు దొంగతనము చేయుటకు భీతిలేదు. అమాయికుల మోసగించుటకు, మద్యపానమునకు వెఱపందవు. సోదరీమణుల పాతివ్రత్యమును భంగముగావింప వెనుకాడవు. బీదల పీడింప సంశయింపవు. ఆడినమాట తప్పుట పరిపాటియైనది. మోసము, విశ్వాసఘాతము స్వతస్సిద్ధములైనవి. స్వార్థసిద్ధికి చేయు అత్యాచారములకు అంతులేదు. నీకు ఆత్మకళ్యాణమును గూర్చిన చింతలేదా? అంధుడవైతివా? మరి నీవు భయపడున దెవరికి? మట్టిబొమ్మలకా? ఇనుపతునకలకా? రాతిముక్కలకా? ధైర్యహీనులగు పాపాత్ములకా?

భయమును హృదయమునుండి బయటకుగొట్టు !!! అపుడు నీకు అహింసయందలి మర్మము బోధపడును. అపుడు నీహృదయము నిర్మల దివ్యప్రేమతో ప్రకాశించును. ప్రపంచము నిన్ను మిత్రునిగా తలంచును. నీపాదముల ముద్దిడుకొనును. తన పైశాచిక ప్రవృత్తుల నీయెదుట బలిగావించును.

నీవు స్వరాజ్యమును కోరుచున్నావా? ఇంతకుమిన్నయగు రాజ్యము, ఐశ్వర్యము మరి నీకేమికావలయును? స్వరాజ్యమన నవల; నీభ్రూసంకేతనము. నీస్వరాజ్యము

మాట. అటుంచు. ప్రపంచమునకే నీవు స్వరాజ్యమార్గ దర్శకుడవగుదువు. నీవు శత్రులుగా తలంచువారు నిజముగ నీకు శత్రువులుకారు. నీహృదయమందిమిడి నిన్ను భీరుని గానొనర్చి నిన్ను నిర్వీర్యునిగావించు భయమే నీశత్రువు. నీవు భయమను భావమును వదలుము! భయము నీవద్దకు రాసాహసింపదు. నీవు ధనప్రేమను మటుమాయము గావించు! భయము నిన్నుజూచి భయపడును. నీవు స్వార్థమునకు తిలాంజలి యొసంగుము! అది భయమునకు పుట్టినిల్లు. హృదయమాలిన్యమును దూరముగావించు! భయము నీకు కామధేనువగును.నిర్భయమే ప్రపంచమున జీవించగలుగును. నిర్భయము నే ప్రపంచ మాదరించును. నిర్భయులే ప్రపంచమున మనుష్యులు. భీరునకు జగత్తున జాగాలేదు. జీవించుటకు హక్కు లేదు. వాడు ప్రపంచమున ప్రయోజనరహితుడు.

అందుచే నీవు నిర్భయుడవు కమ్ము!

---

## ౪

# ప్రపంచసమస్య

---

మానవుడు సుఖాభిలాషి. సుఖసంపాదనకై అతడు కుటుంబనిర్మాణము గావించెను. జాతుల నేర్పరచెను. గొప్ప రాజ్యముల, రాష్ట్రముల నిర్మించెను. కాని అందువలన వానికి మచ్చునకైన సౌఖ్యము లభింపలేదు. శరీర సౌఖ్యమును గలిగించు భోగసామాగ్రియందు మనస్సున

కానందము గలిగించు గుణమున్నదని మొదట నాతడు తలంచెను.

ఆతనికి భోగసామగ్రియందు, దాని ఆరాధనమందు ఆసక్తి మెండైనకొలది సౌఖ్యాభిలాష అధికమై, అశాంతి మిక్కుటమగుటవలన భోగములవదలి సుఖమును గలిగించు మరియొకవస్తువునకై వెదుకవలసి వచ్చెను. ప్రాపంచికైశ్వర్యమును బొందియు మానవుడు దుఃఖభాజనుడుగా నుండుటను వారు కనుగొనిరి. సుఖసాధనమును వెదుక నారంభించిరి. అందుకు కారణ మారయ యత్నించిరి.

అంతమున వారు మానవునికి కోరికలు అధికముగ నున్నవనియు, అవసరముల నధికమొనర్చుకొనుచున్నాడనియు, అందుల కాతడు స్వతంత్రుడే యైనను అవసర పూర్తి కాతడు పరతంత్రుడుగ నున్నాడనియు కనుగొనిరి. వానికోర్కెలు, అవసరములు పూర్తిగాక అర్ధభాగము అట్టె నిలిచియున్నవి. ప్రతివారును తమ అవసరములను అధిక మొనర్చుకొనుటవలన పరస్పర సంఘర్షణ మేర్పడుచున్నది. ఒకరి అవసరములు, కోర్కెలు మరియొకరికి బాధాకరములగుచున్నవి. ఈ యిచ్ఛలకు, అవసరములకు అంతుండదు. మానవుని యిచ్ఛ ననుసరించి అవి వృద్ధి పొందును. సాధనములవలన వాని తృప్తిగలుగదు. భోగమువలన వానియిచ్ఛ అంతరింపదు అని వారు కనుగొనిరి. కోరికలను, అవసరములను నిరోధించిననే తప్ప వానికి పూర్ణసౌఖ్యము కలుగదని వారు నిర్ణయించిరి. భోగమువలన సుఖప్రాప్తిలేదని, యోగమువలన సుఖప్రాప్తి గలు

గునని వారుచెప్పిరి. భోగత్యాగియై, యోగియైనవానికి అధికసుఖము కలుగునని వారు బోధించిరి. భోగమన అవసరముల నధికము గావించుకొనుట; యోగమన నియమితావసరముల గలిగియుండుట. మానవుని సాధారణావసరములేవి? పొట్టనిండుటకు స్వచ్ఛమైన సాదాభోజనము, శరీరము నిండ గుడ్డ, నివసించుటకు గాలి వెలుతురు బాగుగావచ్చు గట్టి గృహము, సంతానపోషణమునకు, వారి చదువు సంధ్యలకు వలసినధనము. అంతకుమించినది పరిగ్రహించుట చోరత్వమని వారు నిర్ణయించిరి. అపరిగ్రహము సుఖమూలమని వారు నిర్వచించిరి. ఈసిద్ధాంతముల నాధారముగాగొని వారు సంఘనిర్మాణము గావింప మొదలిడిరి.

కాని కోరికల త్యజించుట, అపరిగ్రహము అనునవి మానవున కర్థముకాలేదు. వర్ణవ్యవస్థ ననుసరించి భోగసామగ్రి పంపిణీ జరుగుచువచ్చెను. కానిభోగపరాయణుల మహత్వకాంక్షలు దానినిగూడ ఛిన్నాభిన్నము గావించెను. సుఖసమస్య తత్వరూపమున సులభముగనున్నను వ్యవహారరూపమున అతి క్లిష్టసమస్య. భారతీయజీవితమందు భోగమునకు బదులు సంయమము వ్యాప్తియందున్నను అకర్మణ్యత్వము, భీరుత్వము వారి నావరించి దుఃఖకారణములైనవి. సంయమమువలన వారి కధిక సుఖస్వాతంత్ర్యములు కలుగవలసి యుండగా ప్రపంచములో అందరికంటె వారు పరాధీనులై దుఃఖపడుచున్నారు. సుఖముయొక్క మూలమంత్రమును గుర్తించియు తత్ప్రయోగము నెరుగనందున భారతీయులు దానికి

దూరమైరి.

ఇట్లే ప్రపంచములో ననేకజాతులవారు సుఖము నకై తహతహ లాడుచున్నారు. భారతీయులు సుఖపరిశో ధనకు భోగముల నాశ్రయించి విఫలులై తిరిగి యోగ పాదాక్రాంతులై సౌఖ్యముబొందిరి. పాశ్చాత్యు లింత వరకు భోగములందే భ్రమించుచుండిరి. ఇప్పుడిపుడే యో గకిరణము లచట వ్యాపించుచున్నను వారి నింతవరకు ఆ కర్షింపలేదు. భారతీయులవద్ద యోషధియున్నదిగాని వారు దానిప్రయోగమును మరచిరి. పాశ్చాత్యప్రపంచ మున జీవమున్నదిగాని దిశలు భ్రమించుచున్నవి.

ఈవ్యవహారికప్రపంచమునందెల్ల యెడలను సంఘ మునకు సుఖశాంతిచేకూరుటెట్లను ప్రశ్న వ్యాపించియు న్నది. ఈర్ష్య, ద్వేషము, ప్రతిస్పర్ధ, సంఘర్షణ మొదలగు భావము లెల్ల దేశములయందు అన్నిజాతులయందు వ్యా పించియున్నవి. శాంతి పరిషత్తులు, ఆయుధవిసర్జనసంఘ ములు, సభలు, తీర్మానములు అంతులేకుండ పెరిగిపోవు చున్నవి. సామ్రాజ్యవాదులు దోపిడియందు తన్మయులై యుండుటవలన యితరులసొద వారిచెవుల కెక్కుటలేదు. అటుబోల్షివిక్కులు, కమ్యూనిష్టులు తమ సంఘనిర్మాణ మునందు తగుల్కొనియున్నారు. ఇటు ముస్సోని యేక తంత్రనిర్మాణము గావించుచున్నాడు. స్వపరవిభేదములు పోయి సర్వసమానమగు పంపిణీ విధానము రానంతవరకు సంఘమందలి కలహము లంతరింపవని సామ్యవాదులు చెప్పుచున్నారు. ప్రజాభిప్రాయమువనుసరించి సంఘము, రాజ్యము నడుపబడనిచో సంఘమెన్నటికిని ఉన్నతిని బొం

దదని ప్రజావాదులు చెప్పుచున్నారు. వీటినిబట్టి ప్రపంచ మింతవఱకును భౌతికపదార్థములయందే సౌఖ్యమున్న దని తలంచి వానినే పరిశోధించుచున్నదని గ్రహింపవల యును. వీరందరిలోను భౌతికదృష్టితో చూచిన సామ్య వాదమే సౌఖ్యమున కతి సమీపముననున్నది. ప్రపంచ మందలి సుఖసాదనసంపత్తియంతయు అందరకు సమాన రూపమున లభింపవలయును. ధనిక దరిద్ర తారతమ్యము లేక స్త్రీపురుష విచక్షణలేక, సభ్యతాసభ్యతావిచారణ లేక సాధారణజీవితమున కవసరమగు సమస్తసామాగ్రి సమానరూపమున అందుబాటులో నుండవలెను.

కొంతవరకు మాత్రమే యిది సంఘహితమునకు సాధనము కాగలదు. ఇది సుఖసాధన పంపిణీ విధానమున గల దోషమును దూరముగావించుటకు తోడ్పడునుగాని భోగాభిలాషను శాంతిపరుపజాలదు. నేడు నిర్ధనులకు, ధని కులకు, వైభవోపేతులకు, దుఃఖితులకు, రాజులకు, బీద లకు మధ్యయేర్పడిన లోటును పూర్తి జేసి వారియందేర్ప డిన విద్వేషమును సామ్యవాదము పోగొట్టినను ధన, ఐశ్వర్యప్రతిస్పర్థ వ్యాపింపవచ్చును. సుఖభోగముల నియ మిత మొనర్చుకొననంతవఱకు సంఘమును ప్రతిస్పర్థ, వర్గకలహములనుండి రక్షింపజాలము. సుఖభోగముల రెం డువిధముల నియమిత మొనర్చుకొనవచ్చును.

౧. మానవుడు తనశరీరకష్టసంపాదన ననుసరించి సుఖభోగము లనుభవించుటకు వీలుకలుగ జేయుట.

౨. మానవుని సాధారణావసరముల నిర్ణయించి అంతకుమించి పరిగ్రహించుటను నిషేధించుట.

ఏసిద్ధాంతమునందైనను మానవుని సంయమిగా నొనర్చుటకు యత్నింపవలయును. మొదటి సిద్ధాంతము కృత్రిమబంధనమువలె గనుపించినను ఆచరణయందు బెట్టుటకు వీలుగను, సులభువుగను ఉన్నది. కాని అది మానవుని అవసరముల నియమితత్వ మొనర్చుటలేదు. కోరికలుండియు మానవుడు స్వయముగా వానిని పూర్తిగావించుకొననేరడు. కాని పలుమారట్లు తలంచుటవలన, కోరికలు సిద్ధింపనందున నియమోల్లంఘన మొనర్చు భావము వానియందు ప్రబలమై ఆ నియమమును విచ్ఛిన్నముగావించును. రెండవ నియమము మానవుని అవసరముల నియమిత మొనర్చుచున్నది. ఈనియమము వానికి అధికేచ్ఛ అసమంజసమని బోధించును. ఇది స్థాయియు, అధికఫలదాయియునగు నియమము. మొదటినియమమున కలవడిన పిమ్మటనే రెండవది సులభసాధ్యమగును. ఇంతవరకును సామ్యవాదుల సామాజికవ్యవస్థకు తగిన సాధనము నిర్ణీతముకాలేదు. వారి సమాజశాస్త్రమున కింకను పరిణతావస్థ కలుగలేదు. వారు సమతాసిద్ధాంతమువఱకు చేరిరి. ఇక వారు అపరిగ్రహమో లేక సంయమమో అను స్థానమునకు చేరవలసియున్నది. వారు వాస్తవముగ వైజ్ఞానిక సామ్యవాదులైన భోగమును త్యజించి యోగము ననుష్ఠించుట యెంతయు అవసరము.

కొందరు మిత్రులు భోగమువలన పురుషార్థము, కార్యదీక్ష వృద్ధిబొందునని; యోగమువలన ప్రపంచమనిన ఉదాసీనభావమేర్పడి అకర్మణ్యత్వ మేర్పడునని చెప్పుచున్నారు. అది భ్రమయని నాతలంపు. భోగమువలన

పురుషార్థ మభివృద్ధిబొందక స్వార్థము వృద్ధిబొంది విలాస ప్రియత్వముగనో, అత్యాచారముగనో పరిణమించును. యోగమువలన ప్రపంచవిముఖత్వమేర్పడక స్వార్థవిముఖత్వమేర్పడి సేవాభావముగ మారును. అనుక్షణము మానవసేవ యొనర్చుటే నిజమగుయోగము. యోగుల కర్తవ్యము. భారతదేశము యోగపీఠము నధిష్ఠించినది. కాని కర్మణ్యత్వమును మరచి నేడు నిర్జీవమైనది. కర్మయే జీవితపరమావధి. అదియే జీవితము. స్వార్థభావపూరిత మగు కర్మవలన అసురప్రవృత్తు లధికమగును. సేవాభావపూరిత కర్మవలన దైవీప్రవృత్తు లధికమగును. కర్మ జీవితమునకు ముఖ్యము. అదిలేని జీవితము వ్యర్థము.

సుఖసమస్యనుగూర్చిన చర్చ కొంతసేపటుంచి వర్తమానవిశ్వసమస్యనుగూర్చి విచారింతము. వర్తమాన ప్రపంచసమస్య ఆర్థికమునకు సంబంధించినంతగా రాజకీయమునకు సంబంధించలేదు. ఇపుడు దిగ్విజయములు, సామ్రాజ్యస్థాపన పూర్వమునకువలె చక్రవర్తిపదవుల నధిష్ఠించుటకుగాదు. భోగాభిలాష ప్రపంచమున వివిధ రూపములతో దినదిన ప్రవర్ధమానమగుచున్నది. ధనము లేకుండ ఉద్యోగము, వృత్తి, వ్యాపారము, కర్మాగారములు లభింపవు, సాగవు. వ్యాపారలాభమునకు రాజ్యము స్థాపింపబడుచున్నది. ముడిపదార్థములుండి తయారు సరుకుల విక్రయమునకు అంగడులున్న రాజ్యములు బలవత్తరములుగా నెంచబడుచున్నవి. ముడిపదార్థము లధికముగనుండి అమ్మకమునకు వీలున్న దేశములపై సమస్త దేశములు తమ విషపూరితదృక్కుల ప్రసరింపజేయు

చున్నవి. వి దేశముల విషపూరితదృక్కులకు గురియైన దేశములలో భారతదేశము అగ్రగణ్యము.

ఈ అనియంత్రిత భోగతృష్ణవలన గలిగిన ఫలితమే వర్తమానసామ్రాజ్యవాదము. సామ్యవాదమింకను భోగతృష్ణపై ప్రహార మొనర్పకపోయినను ధనైశ్వర్య మదోన్మత్తులకు సంయమపాఠము బోధింపగోరుచున్నది. తాత్త్వికప్రపంచమున సంయమము, అపరిగ్రహము సుఖమున కెట్లు మూలకారణములో వ్యావహారికప్రపంచమున శారీరకశ్రమసిద్ధాంతము అంతముఖ్యమైనది. సంపద యొకచోట ప్రోగై మురిగిపోకూడ సర్వత్ర వ్యాపించుటకు శారీరకశ్రమ సిద్ధాంతమే ఉపయోగకరమైనది. నేటి యంత్రములు, కర్మాగారములు శరీరశ్రమప్రభావముపై గాక ధనప్రభావముపై నాధారపడి, శ్రమకుతగిన ఫలము లభింపక, ఫలమంతయు భాగస్వాములకె చెందుచు యెంతయో అన్యాయముతో నడుచుచున్నవి. ఈయంత్రములు, కర్మాగారములు ఉండుట సంఘమునకు తప్పనిసరియైనచో, అభీష్టములయినచో పంపిణీ విధానమునం దెంతయో మార్పుచెందవలసి యున్నది. కాని మనము భోగముల నియమిత మొనర్చుకొనక మానవశక్తినం తను ధారవోసి చివరకు ఆవిరియంత్రములపైనను, విద్యుద్యంత్రములపైనను ఆధారపడిన సంఘము సంకటముల పాలగును. మానవసంఖ్య స్వల్పముగనున్న దేశములయందు మొదట నీయంత్రములు వెలిసినవి. సంవత్సరమున కారు మాసములైనను పనిలేనికోట్లకొలది జనసంఖ్యగల భారతదేశమున యంత్రస్థాపనచేయుట మాన

వశక్తిని తిరస్కరించుటయే యగును. పంపిణీ విధానము నందెంతగనో అన్యాయము వ్యాపించును. భోగేచ్ఛను స్వల్పముగనైనను నిరోధించుట, మానవునకు అందులో విద్యావంతులకు కఠినముగతోచుట ప్రపంచమందలి ఆసుర ప్రవృత్తుల నన్నిటిని ఏకోన్ముఖముగావించి ఉచితానుచిత విచక్షణమాని భగీరథప్రయత్నము గావించుట సులభముగ కన్పట్టుట యెంతయు శోచనీయము.

ప్రపంచము సుఖాన్వేషణ యందున్నది. సంయమము, అపరిగ్రహము, యిచ్ఛానిరోధము సుఖమునకు మూలములు. కాని సాధనములు కఠినముగ కన్పడచున్నవి. ప్రపంచము సరళోపాయములు కావలెననుచున్నది. సామ్యవాదులు సంపద సర్వజనలభ్యమగు సాధనమును దానియెదుట నుంచిరి. దానివలన ప్రపంచవిషమస్థితి కొంతవఱకు తగ్గగలదు. శరీరశ్రమసిద్ధాంతమును సమాజ మామోదించిన సమతాసిద్ధాంతమందున్న అపూర్ణత్వము తొలగిపోవును. ఇట్లు ప్రపంచసమస్య ఆర్థికసమస్యచే నావరింపబడియున్నది. రాజనీతి దీనికి పరికరము యంత్రము లీసమస్యను తొలగింపజాలవు. శ్రమధర్మము లేక మానవశక్తియే దీనిని పరిష్కరింపగలుగును.

---

## ౫
## అన్నదాత రైతు

రైతు మన అన్నదాతయను విషయము నిర్వివాదాంశము.

రైతులు బహుసంఖ్యాకులు. అయిననేమి? అందరి కన్న దుఃఖభాజనులై యున్నారు. అందరికన్న మిన్న యగు సంఖ్యగలిగి నోరువాయి లేక అణగి మణగి పడి యున్నవారెవ్వరైననున్న వారీ కృషీవలులే.

ఇట్లుండుటకు కారణమేమి? వారి అవిద్య. వారు తమస్థితిగతులను గమనించలేని వారగుట.

దేశక్షేమమును కోరుదుమేని మనము రైతుల కష్టములను, తన్నివారణోపాయములను యోచింపవల యును. వారికష్టములను రాజకీయ వ్యవసాయ విద్యా ఆరోగ్యములకు సంబంధించినవని నాలుగు భాగములుగ విభజింపవచ్చును. సామాజిక ఆర్థిక దుఃఖములు వీనిలోనే సమ్మిళితమై యుండును.

## రైతుల రాజకీయ కష్టము

అన్నిటిని తలతన్నినది. దేశమున రాజకార్యముల యందు వారి మొఱ నాలించువారులేరు. వారికి సాయ పడువారులేరు. ప్రాచీనకాలమున ప్రతిగ్రామము స్వతంత్ర ముగ నుండెడిది. ఒక పన్నులవిషయమునతప్ప తక్కిన గ్రామపరిపాలనాభారమంతయు గ్రామవాసులపైననే యుండెడిది. నేడు పోలీసుబంట్రోతు వారికి చక్రవర్తికి పైచక్రవర్తిగ కన్పడుచున్నాడు. జమీందారీలలో వారు జమీందారులకు దాసానుదాసులు. రైతువారీవిధాన మున్నచోట గ్రామమునసబు, తహశీల్దారువారి ప్రభువులు. వీరందరు దోపిడీవిధానముపై నాధారపడియుండువారే. శిస్తులు యితర మామూళ్ళు వారిని పిండి పిప్పిచేయు చున్నవి. ఇండ్లు వాకిళ్లుపోగా వారికి మిగులునది ధాన్య

ములోని పొల్లు. అతడు నామమాత్రముకు భూస్వామి. వారికి సంఖ్య యెంతయున్నను రాజదర్బారులయందు వారి మాట తలపెట్టువారుండరు. వారినాదరించువా రచట కన బడరు. రైతులు వారికి పాదాక్రాంతులై జోహుకుము లుగా నుండుటకన్న గత్యంతరములేదు. రైతుల రాజ కీయదుస్థితిని తొలగించుటకు ఈక్రిందివిషయములు నమలుపరచు టత్యావసరము.

౧. రైతులే భూమికి హక్కుదారులు. ప్రభుత్వము నకుగల హక్కుకై అతడు పన్నునిచ్చుటలేదు. ప్రభుత్వ నిర్వాహణము తనకర్తవ్యమని యెంచి తనపైనున్న భారము నిర్వర్తించుకొనుటకు ఆత డిచ్చుచున్నట్లు నిర్ణయింప వలెను.

౨. రైతు ప్రతినిధులే శిస్తునిర్ణయించవలయును.

3. గ్రామవ్యవహారములందు వారిని స్వతంత్రు లనుగా నొనర్చి పంచాయితీల నేర్పరచి తద్వారా గ్రామ పరిపాలన సాగించవలయును.

భూమి విషయమున అనగా భూమి రైతుదని–కాదు ప్రభుత్వమున (State) దని రెండు వాదము లున్నవి. ఒక పక్షమువారు భూమి ప్రభుత్వమునకు చెందిన దని దానిని దున్నుకొని ఫలమనుభవించినందుకుగాను రైతు బాడుగ నిచ్చుచున్నాడని బాడుగను హెచ్చించు టకు, తగ్గించుటకు ప్రభుత్వమున కధికారమున్నదని రైతు అందుకు సమ్మతించిన దున్నుకొనవచ్చునని లేనియెడల వీలుపడదని చెప్పుచున్నారు. ఇంక రెండవపక్షమువారు భూమి రైతుదే ననుచున్నారు. అతడు శ్రమజేసి ఫలింప

జేయుచున్నాడుగాన భూమి అతనిది. ప్రభుత్వము తన ఖర్చుకుగాను కొద్దిభాగమును వానినుండి తీసికొనవలెను. ప్రభుత్వము నిజముగా ప్రజలదై ప్రజలచే యెన్నుకొనబడి ప్రజాహితమునకు సాగింపబడు రష్యారాజ్యమువలె నున్న పుడు భూమి ప్రభుత్వమునకు చెందినను యెవరికిని యెట్టి కష్టమునుండను. ప్రభువుగాని, స్వార్థసిద్ధికి పాటుబడు సముదాయముగాని పాలించునపుడు భూమి ప్రభుత్వము నకు చెందియుండు టనుచితము. ప్రభుత్వము రైతు హిత మునకు, సౌఖ్యమునకు యేర్పడినదని గ్రహించువరకు రైతే భూమికి అధిపతిగా నుండవలెను. అట్టి ప్రభుత్వ మేర్పడవలెనన్న సత్తాధారిణసంస్థ (Government)లుండి బలముపై రాజకార్యముల నెరవేర్చు పద్ధతి నంతరించ వలెను. వెలుపలిశక్తు లెవ్వియో మనపై అంకుశమును చలాయించుచున్నవని అనుభవమునకు వచ్చుచున్నంత వరకు రాజ్యములో దానిని ఐక్యపరుపగూడదు.

### కృషి సంబంధమగు కష్టములు

ప్రభుత్వము పన్నులు వసూలుజేయుటయే గాని వారి యోగక్షేమములు విచారించి ఫలసాయాభివృద్ధికి తోడ్పడదు. పంట నభివృద్ధిపరచు తెరగు ఎరింగింపదు. వ్యవసాయశాస్త్రవేత్తలు భారతదేశభూమి నిస్సారమై పోవుచున్నదని చెప్పుచున్నారు. ఎరువుకు ఉపయోగపడు పేడ మొదలగునవి అన్నియు వంటచెరకు తగ్గిపోవుటవలన అందుకు ఉపయోగపడుచున్నవి. ప్రభుత్వము అట్టిపనిని నిరోధించదు. స్వేచ్ఛావ్యాపారమువలన హిందూదేశమం నందలి ధాన్యపురాసులు పరదేశముల పాలగుచున్నవి.

రైతుకు తిండికికూడ మిగులుటలేదు. వ్యాపారమువలన కలుగు లాభము దలారీల పాలగుచున్నది. అందుకుబదులుగ విదేశములనుండి పనికిమాలినవస్తువులు దిగుమతియై దేశమందలి ధనము నాశనమగుచున్నది. ఈ విధానము వలన పారిశ్రామికదేశములు ధాన్యరాసులతో కొల్లబోవుచుండ సస్యశ్యామలయగు భారతమాత కాటకములతో తెల్లబోవుచున్నది. రైతులస్థితిని బాగుపరచుటకు ఈ క్రింది విషయములు అమలుపరుచవలయును.

౧. పేడ పిడకలుగమార్చుట మానిపించి దానినంతను పొలములోనికి జేర్పించవలయును. శాస్త్రీయమైన యెరువులద్వారా భూసారమును పెంపొందించవలయును.

౨. రైతులు తమకు మరుసంవత్సరపు పంటవచ్చువరకు సరిపోవు ధాన్యమును, వలయు విత్తనములను నిలువజేయవలయును.

3. హెచ్చించిన భూమిశిస్తును తగ్గించవలయును.

౪. ప్రత్యేకసుంకములవలన, సాంఘికదురాచారములవలన, దుర్వ్యసనములవలన, సాహుకార్ల ఆశవలన రైతులు ఋణస్థులగుచున్నారు. వారి దుఃఖనివారణ కేర్పడిన సహకారపరపతిసంఘములు వారిదుఃఖమును పెంపొందించుటకే తోడ్పడుచున్నవి. సేవాపరాయణులతోగూడిన రైతు శ్రేయస్సుకు పాటుబడు సంఘముల నెలకొల్పవలెను. అందు కుక్షింభరుల చేరనివ్వగూడదు.

౫. పశుపాలనకు సరిపోవు పచ్చికబీళ్ళను ప్రత్యేకించవలయును. పాల అంగళ్ళను నెలకొల్పవలయును.

౬. మరనాగళ్ళను దేశములోనికి రాకుండ నిషేధింపవలయును. ఇయ్యవి ఎక్కువభూమిగల రైతులకు మాత్రమే లాభదాయకము. రైతులు ధనవంతులుగా నున్నపుడు పూంజీవతులు భూఖండముల తమ వశ మొనర్చుకొని రైతులను కూలీలుగ మార్చినపుడు వానివలన లాభముకలుగును, అందువలన యేకొద్దిమందియో తప్ప తక్కిన వారందరు నిరుద్యోగముపాలై దరిద్రదేవతారాధకు లగుదురు. బీదలధనము ధనికులపాలై చేతివృత్తులు నశించి వ్యాపించిన నిరుద్యోగముకన్న యిందువలన వేయిరెట్లధికముగ నిరుద్యోగము వ్యాపించును. ఇట్లు పెచ్చుపెరిగిన నిరుద్యోగసమస్యను పరిష్కరించుట అసాధ్యము.

౭. తీరికకాలమందు వారికి తగు ఉపవృత్తులు కల్పింపవలయును. తాళ్ళుపేనుట, కట్టెలమ్ముట, బాడుగ తోలుట మొదలగు పనులు రైతులు చేయుచుందురు. కాని దూదియేకుట, యేకులుచేయుట, నూలువడకుట ; అన్నిటికంటె మించిన ఉపవృత్తులు. మిగుల ప్రయోజనకరములు. ఎక్కువ పెట్టుబడి అవసరముండదు. పెద్ద తెలివితేటలతో పనిలేదు. ఒకరిక్రింద లొంగియుండ నక్కరలేదు. ఇవి అందరు యెరిగినపనులు. అందరు చేయగలపనులు. రైతుకు సాలుసరి ఆదాయం ముప్పదిరూపాయలకు మించదు. పైదానివలన ఆత డీఆదాయమును పెచ్చుగ సులభముగ గడించును.

## విద్య

రైతులు విద్యాశూన్యులుగ నున్నారు. సదాచార

ములయందు, సంస్కారములయందు వీరు విద్యావంతులను మించియున్నను అక్షరజ్ఞానహీనులగుటవలన వారికిగలుగు యిక్కట్లు చెప్పశక్యముగానివి. అందువలన వారు సర్కారుఉద్యోగులవల్లను, దుకాణదారుల వల్లను, ఋణదాతలవల్లను మోసగింపబడుచున్నారు. ప్రపంచ పరిస్థితు లెరుగనందున దేశస్థితి తెలియనందున వస్తువుల ధరలలోని హెచ్చుతగ్గులు, కోర్టు వ్యవహారము తెలిసికొను జ్ఞానము లేనందున గడునిడుముల గుడుచుచున్నారు. అట్టి చిక్కులను తొలగించుటకు వారికి ప్రారంభవిద్యను గరపవలెను. దానితోబాటు కృషి, పశుపాలన, సాధారణ రోగనివారణవిధానములు, దేశముయొక్క సాధారణ పరిస్థితులు అవసరమగు లెక్కలు మొదలగు సర్వ విషయములు వారికి బోధింపవలయును. వారు విద్యలేని కారణమున నిష్ప్రయోజకులగుటయేగాక అంధులుగ గూడ నున్నారు.

## ఆ రో గ్య ము

ఆరోగ్యమునుగూర్చిన జ్ఞానము లేనందున వారు అపరిశుభ్రతవలన కలుగు చెడుగుల గుర్తింపజాలకున్నారు. గ్రామమునకు దాపున పెంటపోగు పోయుట, వీథులయందే మలమూత్రవిసర్జన, రోగనివారణసాధనము లెరుంగకబోవుట పల్లెటూరివారి పద్ధతి యనుకొనినట్లు పరిస్థితులు మారినవి. వారికి ఆరోగ్యమును,రోగములను గూర్చి బోధించునపుడు రోగనివారణసాధనములను గురించిగూడ బోధింపవలయును. అందులకు తగు యేర్పాట్లు గావింపవలయును. ఇంగ్లీషుమందులు మిక్కిలి ఖరీదైన

వగుటచే నాటుమందులు, హోమియోపతి మందులు మొదలగునవి వాడవలయును. జ్వరములు, వ్రణములు, కండ్ల జబ్బులు, కడుపునొప్పి, పాముకాటు మొదలగునవి పల్లెటూళ్ళయందు మెక్కువగ నుండును. అందుకు అనుక్షణము చికిత్సజరుగుటకు వీళ్ళు కలిగించవలెను.

దేశసేవకులు తమశక్తినంతను గ్రామసేవయందును రైతుకూటము నిర్మాణమునందును వినియోగింపవలయును. భారతదేశమునందు సుశిక్షితులగువారు, దేశసేవాతత్పరులగు యువకులు పల్లెటూళ్ళను తమ కార్యక్షేత్రములుగా నొనర్చుకొని రైతుల యిక్కట్టులను తొలగింప ఆందోళన గావింపకున్న స్వరాజ్యరథము ముందుకు సాగదు.

---

౬

# నేటి దాతలకు—యాచకులకు

---

## దాతలు

మనదేశమున దాతలు ౧. పురాతనకార్యములకు ధనము వెచ్చించువారని, ౨. దేశహితమునకు, సంఘశ్రేయస్సునకు ఖర్చుపెట్టువారని, ३. సర్వసాధారణులని మూడు నాలుగు రకములవా రున్నారు.

పురాతనకార్యములకు ధనము నొసగువారియందు ధార్మికభావ మధికముగనున్నను ధార్మికజ్ఞానము తక్కువ. వారికి దేశము, సంఘము మొదలగు విషయము

లసలే తెలియవు. ప్రాతపద్ధతులయందు అధికమగు నమ్మ కముగలవా రగుటవలన అట్టిహాని కొసగుటయే నిజమగు ధర్మమని వారిభావము. అది వారితప్పుగాదు. ఆతప్పం తయు వారికట్టిభావము కల్పించినవారిది. కల్పించుచున్న వారిది. వారు ధార్మికభావము కలవారగుటచే ఎప్పుడై నను తమతప్పిదమును గు ర్తింపగలుగుదురు. తప్పక యెప్పు డో ఒకప్పుడు దేశహితకార్యములకు తోడ్పడగలరు. అట్టివారికి దేశకాలపరిస్థితులగూర్చి బోధింపవలయును.

ఇక రెండవరకపు దాతలయందు రెండురకముల మనుష్యులున్నారు. కొందరు మంచికార్యములన్నింటికి సాయపడుదురు. కొందరు కొన్నికార్యములకు మాత్రమే సహాయపడుదురు. మొదటివారు కార్యక ర్తల నెక్కువగ దృష్టియందుంచుకొందురు. రెండవవారు కార్యక ర్తలను, కార్యమును గమనింతురు. మొదటివారికి కార్యక ర్త ఉ త్తముడుగను, విశ్వాసపాత్రుడుగను కన్పడిన కార్య మును విచారింపకయే దానమొన ర్తురు. రెండవవా రంత టితో తృ ప్తిచెందరు, వారతని కార్యమును పరిశీలింతురు. కార్యము ఉ త్తమమా? ఆత డా కార్యమును సక్రమముగ నెరవేర్చునా? అది నాకు నచ్చినపనియేనా? యని తర్కించి పనిచేయును. మొదటివానియందు ఉదారత, రెండవవాని యందు వివేకము అధికముగనున్నది. ఒకనికి ప్రభువువలె ఔదార్యమున్నది. రెండవవానికి సేనానాయకునివలె వివే కము, తారతమ్య బుద్ధియున్నది. మొదటివాడు దానము పై ధ్యానముంచినట్లు, కార్యమును దాని ఉపయోగ మును, కార్యనిర్వహణమునుగురించి యోచింపడు. రెం

డవవాడు తరువాతి విషయములనుగూర్చి చింతించును. మొదటిదాతవలన పెక్కుమందికి కొద్దికొద్దిగా ధనము లభించును. రెండవవానివలన కొద్దిమందికి యెక్కువ ధనము లభించును. మొదటిదాత ధూర్తులవలలో పడవచ్చును. రెండవదాత నిజమగు యాచకులనుగూడ నిరాశ పెట్టవచ్చును. ఇన్ని మనః ప్రవృత్తులను గుర్తించి భిక్షాపాత్రను చేతబట్టవలయును. మొదటిరకపు దాతలవద్దకు ప్రతియాచకుడును పెద్ద అభిలాషతో తరుచుగ పోవును. అట్లు పోవువారు నిరాశ, పశ్చాత్తాపము, అవమానము వీనికి సదా సిద్ధపడియుండవలెను. రెండవరకపు దాతదగ్గరకు వాని ప్రియకార్యములకు తప్ప అన్యకార్యములకు వెళ్లువారు నిరాకరణమును సహించు ఓర్పు గలిగియుండవలయును.

ఇక సర్వసాధారణులగూర్చి యోచింతము. వారు దాతలయందును, దానపాత్రులయందును చేరుదురు. ప్రజాహిత కార్యములు సాధారణముగా నీ సర్వసాధారణులకొఱకే చేయబడుచుండును. ధనము వారిది, లాభము గూడవారిదే. సమాజహితమునకు ధర్మముచేయుట ధనికుల కర్తవ్యమని మన వర్ణ వ్యవస్థ బోధించుచున్నది. అట్టివానికి వారినుండియే ధనము లభింపవలయును. నిజమునకు ధనికులవద్దనున్న యాధనమంతయు సర్వసాధారణజనులనుండి సంగ్రహించినదే. వారినుండి సంపాదించిన ధనము తిరిగి కొద్దిగ వారిసహాయమున కివ్వబడుచున్నది. ఈసంగతి వారు గ్రహించుటలేదు. సామాన్యజనులు తమ సంస్థలను తమకార్యములను తమధనముతోనే సాగించుట

మంచిది; ఒకరు దానమిచ్చుట, మరియొకడు పుచ్చుకొనుట యను నివి మానవుని స్వాభిమానమును కళంకిత మొనర్చును. ఉపకారకర్త తాను అధికుడనని అభిమానపడును, ఉపకృతుడు తాను తక్కువయను అవమానమును పొందును. దాత కర్తవ్యభావముతో దానమిచ్చి తన ధనము సద్వినియోగమునకు వచ్చుట తనభాగ్యమని తలంచిన, భిక్షుకుడు తాను ధన్యుడనని తలంచిన— దేశహితమునకు, సంఘశ్రేయమునకు యాచించుటకన్న, అవమానపడుటకన్న అందము, సుఖము మరియొకటియుండదు. కర్తవ్యసేవాభావములతో దానమిచ్చిన తీసుకొనవలెను. అందు ఉపకార విశ్వాసములు లేనిచో అట్టి దానపద్ధతిని తీసివేసి స్వావలంబనసిద్ధాంతమును ప్రచారము గావించవలెను. ప్రస్తుతకాలమున దాతలకు, యాచకులకు మధ్యనున్న అస్వాభావికమును, ఉద్వేగజనకమును అగు సంబంధము వాంఛనీయముగాదు.

### యాచకులు

యాచకులయం దనేకరకములవా రున్నను వారిని కుక్షింభరులని, సేవాపరాయణులని రెండువిధములుగ విభజింపవచ్చును. మొదటిరకపు భిక్షుకులను అనగా యాచకభిక్షుకులను దోపిడిభిక్షుకులని చెప్పవచ్చును. సేవాపరాయణులు అంగీకృతకార్యములకు సహాయ మర్థింతురు. తమపోషణమునకు సరిపోవు ధనమును వారు సంస్థలనుండి తీసుకొందురు.

దాతలు ముఖస్తుతుల కుబ్బొంగి, నిందకు భయభ్రాంతులై దానమొనరింపగూడదు. కార్యకర్తను, దాని

యుపయోగమును, యోగ్యతనుబట్టి దానమియ్యవలెను. యాచకులు దాతనుగుర్తించి అవసరమునుబట్టి యాచింపవలెను.

దాతలకు

౧. దేశకాలపాత్రముల విచారించి దానము చేయవలెను.

౨. ఇచ్చునది సంతోషముగ నివ్వవలెను. అనిష్టతతోగాని, బలవంతమువలనగాని దాన మొసర్పగూడదు.

౩. దేశసమాజహితములగు కార్యములకే దాన మొసర్పవలయును.

౪. దానమునకుముందు ఆతడు స్వార్థసిద్ధికి యాచించుచున్నాడా ? కుటుంబపోషణకా ? అంగీకృత కార్యమునకా? యని యోచించి వ్యక్తిని, కార్యమునుబట్టి ధన మొసగవలయును.

౫. వచ్చినవారందరికి కొంతధన మిచ్చుటకుబదులు విశ్వసనీయులగువారిని ప్రధానులుగా నియమించి సహాయపడుట యుత్తమము.

౬. దానమిచ్చినసొమ్ము యెట్లుపయోగపడుచున్నది పరిశీలించుచు అవసరమైనపుడు అడుగకుండనే ధన సహాయము చేయవలెను.

౭. ఇదివర కిచ్చిన ధనమునకు సరియగు లెక్కలున్నవా ? పొదుపుగ ఖర్చుపెట్టుచున్నారా? సక్రమవినియోగము జరుగుచున్నదా ? లేక విశ్రాంతి విరామములకా ? యని యెపుడును పరిశీలించుచుండవలెను.

౮. యాచకుని యెప్పుడును నిరాదరణ చేయగూడదు. స్నేహపూర్వకముగ వాని మాటలను విని శాంతముగ జవాబుచెప్పవలెను. సహాయముచేయ నిరాకరించినను కఠినత్వము చూపగూడదు. ఈనియమములు భిక్షుకులందరియెడను వర్తించును. యాచకభిక్షుకులకు దానమిచ్చుట గృహమందున్న లక్ష్మిని కాలదన్ని మట్టిపాలుగావించుటయగును.

యాచకులకు

౧. ప్రజాహితకార్యనిర్వహణమునకు మాత్రమే యితరుల యాచింపవలెను.

౨. స్వంతకర్చుల కితరుల యాచించవద్దు. జీవితపోషణభారమును సంస్థలపై, అంగీకృతకార్యములపై వేయవలెను. ఆకలిచిచ్చుతో మరణించుటకైన సిద్ధపడవలెనుగాని, ఉదరపోషణార్థ మెవరిని యాచించగూడదు.

3. యాచనకుముందు మానావమానములను, ఆశానిరాశలను, త్యజింపవలెను. సహాయము లభించిన ఉబ్బి తబ్బిబ్బులు కాగూడదు. లేనిచో నిరాశను చెందగూడదు. ఇచ్చిన ధన్యవాదములు, ఇవ్వకపోయిన దూషణ యివి పనికిరావు.

౪. కార్యము నిలిచిపోయినపుడే యాచనకు బయలుదేరవలెను.

౫. లెక్కలవిషయమున చాల జాగ్రత్తగ నుండవలెను. కార్యనిర్వహణమందు ఆలస్యము, ప్రమాదము జరుగకుండ చూచుచుండవలెను, అట్లు చేయనిచో యితర సహాయ మర్థించుటకు వీలుండదు.

౬. దాతలను ఆకర్షించుటకు ఆడంబరములు చేయరాదు. వారిని ఉబ్బించుటకు వ్యర్థపు పొగడ్తలు గాని, భయపెట్టి ధనము గ్రహింపవలెననిగాని తలంప రాదు.

౭. అట్టి కార్యములన్న అభిలాషయున్నవారి యొద్దకే యాచనకు పోవలెను.

౮. సంస్థలు కేవలము ధనబలముపై నాధారపడి నడువక త్యాగ తప స్సేవలబలముపై నడుచునని గ్రహింప వలెను. సేవలేనిచోట ధనము భోగవిలాసముల కుప యోగపడును. నిలువయుంచుటకై ధనమును ప్రోగుచేయ గూడదు.

దాతలు, యాచకులు ఈ విషయములు గమనించి మెలంగిన ధనాభావమువలన ప్రజాహితకార్యములు ఆగి పోవుటగాని, ధనము దుర్వినియోగపడుటగాని, వారిమధ్య నిందాతిరస్కారములు జరుగుటకుగాని వీలుండదు. అట్టి యాచకులు-దాతలు ఉన్న సంఘము ధన్యము. ఆ సంఘ మెంత పీడింపబడి పతితమైనను తప్పక బాగుపడును. ఇది తథ్యము.

---

## ౭
## వివాహము

కొంతకాలమునుండి స్త్రీపురుషులను వివాహబంధనములతో బంధించుట అనవసరమని ప్రచారము సాగు

చున్నది. వారు వివాహము ఇచ్ఛాతృప్తికి సంబంధించిన దని చెప్పుదురు. కొందరు వివాహమనునది పతనమొనర్చు నని, బ్రహ్మచర్యముతో నుండు జీవితమే ఆదర్శయుతమని తలంచుచున్నారు. అందువలన మనము వివాహమనగా నేమియో పూర్తిగా గ్రహించవలెను.

వివాహముయొక్క పుట్టు పూర్వోత్తరముల విచారించిన వివాహము శరీరసుఖమునకు లేక ఇంద్రియారాధనమునకు యేర్పడినదని తెలియగలదు. కొంతవయస్సు దాటిన పిమ్మట స్త్రీపురుషులను ఒకరినొకరిని ఆకర్షింపజేయు కోమలమగు వికార ముత్పన్నమై కొంతకాలమున కది నశించును. ఆదిమకాలమున స్త్రీపురుషులు యెట్టి బంధనములు లేకుండనే ఈ వికారమును తృప్తిపరుచుకొనుచుండిరి. కుటుంబజీవిత మేర్పడినపిమ్మటగాని, అందువలన గలిగిన దుష్పరిణామములు అనుభవమునకు వచ్చిన పిమ్మటగాని వారట్టి నియమము నేర్పరచియుందురు. అప్పటినుండియే కౌటుంబికజీవిత మారంభమైనది. ఒక స్త్రీ అనేకులగు పురుషులతోను, ఒకపురుషుడు అనేకలగు స్త్రీలతోను సంపర్కము గలిగియుండుటవలన గుప్తరోగములు వ్యాపించియుండవచ్చును. సంతానపోషణమున పలుచిక్కులు గలిగియుండవచ్చును. అపుడువారికి వివాహవిధానము నేర్పరచుటకన్న గత్యంతరములేకపోయెను. ఒక స్త్రీ ఒకేపురుషునితో సంపర్కముగలిగి యుండునట్లు చేయుటే వివాహముయొక్క ఉద్దేశ్యము. అందుకు విరుద్ధమగు స్థితిని వ్యభిచారమందురు. వారు కారణమునుబట్టి ఒక స్త్రీ ఒకనికన్న యెక్కువమంది పురుషులతో సంబం

ధము గలిగియుండుటను, ఒకపురుషుడు మెక్కువమంది స్త్రీలతో సంబంధము గలిగియుండుటను సమర్థించు కొన్ని ఉపనియమముల గావించిరి. వివాహసంస్కారము లేకుండ జరుగు సంపర్కమును వ్యభిచారమని నిర్ణయించిరి. అటులనే వివాహితులగు స్త్రీపురుషులు పరులతో సంబంధము గలిగియుండుటను గూడ వ్యభిచారమనిరి.

కొంతకాలమునకు జనులందరు విషయభోగము నందు నిమగ్నులై యుండుటచూచి వివాహము యింద్రియభోగమునకు గాదని సంతానోత్పత్తికని ప్రచారము చేసిరి. సంతానేచ్ఛ యున్నపుడే సంభోగము చేయవలెనని నియమము నేర్పరచిరి. మానవులకు అనుభవము వృద్ధిచెంది, విశాలదృష్టి యేర్పడిన కొలది వారి జీవితాదర్శములుగూడ ఉన్నతస్థితి నందుచుండెను. నేడు వివాహము శరీరసుఖమునకుగాని, సంతానోత్పత్తికిగాని గాక ఆత్మోన్నతికని భావింపబడుచున్నది. సుఖము, తృప్తి, సంతానము వివాహమువలన గలుగు పరిణామములైనను ఉద్దేశ్యములు మాత్రముగావు. ఈ ముఖ్యోద్దేశమునకు దూరులై శరీరసుఖము, ఇంద్రియతృప్తి, సంతానము వీనితో తృప్తిజెందినవాడు ఉన్నతిని బొందజాలడు. ఇపుడు వధూవరులు తమ జీవితకార్యక్రమమును పూర్తిగావించుటకు సహాయపడు శ్రేష్ఠమగు వివాహముగ నెంచబడుచున్నది. వికారమునకు లోనుగాక సమాన ఉద్దేశ్యములతోను, గుణములతోను ప్రేరేపింపబడువారే యోగ్యులగు వధూవరులుగా నెంచుచున్నారు. అట్టి వివాహములకు జాతి, మత, ధనములు బాధకములుకాజాలవు.

వివాహమందు జాతి, మత వివక్షతలను పాటింప వలసిన అగత్యములేదు. అవి కుటుంబ, సామాజిక సౌష్ట వమున కేర్పడినవైనను ఇట్టి ముఖ్యవిషయములందు అవి అంత ప్రాధాన్యతను వహింపజాలవు. ఇంద్రియతృప్తి కిని, కుటుంబసౌష్టవమునకు జరుగు వివాహములం దట్టి నియమములు తప్పక పాటింపవలసి యుండును. అట్టి వానిని కనిష్టరకపు వివాహముల క్రింద లెక్కింపవచ్చును.

అయినను వ్యభిచారమునకన్నను, వివాహసంస్కా రమునకు ముందే సంపర్కమేర్పడుటకన్నను, వివాహ మైనపిమ్మట పరులతో సంబంధముండుటకన్నను ఈ కనిష్టరకపు వివాహములే మిక్కిలి శ్రేష్ఠములు వ్యభిచా రము సామాజికముగను, నైతికముగను దోషమై, ఉన్నత పథము నధిష్ఠించిన మానవజాతిని వెనుకటి నీచస్థితికి దెచ్చునదై, నేటివరకదిగడించిన అనుభవమును మంట గలుపుటయగును. ఇంతటి మహాపరాధమును మానవజాతి సహింపజాలదు. ఈసంస్కృతిని రక్షించుటకే అది స్వప త్నితోనైనను నియమరహితముగ చేయు సంభోగమును వ్యభిచారమని నిర్ణయించినది. తమ యుద్దేశ్యముల పూ ర్తిగావించుటకై చేసుకొను వివాహములయందు దంప తులు నిగ్రహము గలిగియుండనిచో అదియు వ్యభిచా రమేఅని బుద్ధిమంతులు తలచుచున్నారు.

---

# ౭
# వివాహసంస్కారము

వివాహసంస్కారము హిందువుల కతిప్రాచీనమై నది. అది పదునారుసంస్కారములలో నొకటి. అది గృహ స్థాశ్రమద్వారము. గృహస్థులు కాదలచు యువతీయువకు లకు వివాహసంస్కారము అవసరము. వివాహము యొక్క ముఖ్యోద్దేశములు.

౧. స్వాభావికేచ్ఛాపూర్తి.

౨. ధర్మపాలనము.

3. సమాజకళ్యాణము.

అనునవి. ఇపుడు వీనినిగూర్చి క్రమక్రమముగా విచారింతము.

## స్వా భా వి కే చ్ఛా పూ ర్తి

కొంతవయస్సు దాటినపిమ్మట స్త్రీపురుషుల మన స్సులందు వివాహముచేసుకొనవలెనను కోరికగలుగును. అపుడు వారిప్రకృతి స్త్రీపురుషులు కలిసి జీవించవలెనను ఇచ్ఛతో నిండియుండును. ఈస్థితి యువతులకు ౧౫-౨౦ మొదలు ౪౦-౪౫ వఱకును, యువకులకు ౨౫-30 మొ దలు ౫౦-౫౫ వఱకును నుండును. మన పూర్వులు ౨౫ సంవత్సరములవఱకు బ్రహ్మచర్యము నవలంబించి తదుపరి గృహస్థాశ్రమమున ప్రవేశింపవలయునని నియమము గావించిరి. యువతులకు ౨౦ సంవత్సరములు ప్రాప్తించు

నపుడు, యువకులకు ౨౫ సంవత్సరములు సమీపించు నపుడు వారి కోరికలు గమనించి తలిదండ్రులు సమగుణ, శీల సంపన్నులగు వధూవరుల చూచి వివాహము గావింప వలయును. వారు తమ జీవితమును బ్రహ్మచర్యమునందే గడుపదలచిన వారిని వివాహబంధనముల బంధింపగూడదు. ఇష్టమున్నవారు వివాహము చేసుకొని - లేనివారు బ్రహ్మచారులుగా నుండుట యుత్తమము. ఈనియమ పాలనవల్లనే స్వాభావికేచ్ఛాపూర్తియగును - వివాహముయొక్క ప్రధానోద్దేశములు పూర్ణతగాంచును.

## ధర్మపాలనము

ఇహపరలోక ఉన్నతినిపొందుటకు ధర్మము సాధనము. అనగా శరీర, మానసిక, ఆత్మోన్నత్యము పొందుట. మానవుడు తాను సుఖపడుచు, ఇతరుల సుఖపెట్టుటయని వీని భావము. అర్థములు, పరిభాష వేరువేరుగ నున్నను స్వార్థ పరమార్థ సాధన మీధర్మపాలనము. స్వార్థము వ్యక్తిగతము. పరమార్థము సమాజగతము. మానవుడు స్వవిషయమునుగూర్చి విచారించునపుడు స్వార్థి. పరుల విషయ మాలోచించునపుడు పరమార్థి. వైవాహికజీవితము స్వార్థపరమార్థముల చేకూర్చునది. మానవుడు గృహస్థాశ్రమమున ఇహపరముల రెంటిని సాధించ గలుగునని ప్రాచీనుల విశ్వాసము. వివాహితు లీధర్మమును పాలించి స్వార్థ పరమార్థముల సాధించగలిగి నపుడే వైవాహిక జీవితము సఫలమగును. హిందువు లిందువల్లనే వివాహధర్మమును ధార్మికబంధనముగ నెంతురు. వారి దృష్టియందు శరీరైక్యత యెంతముఖ్యమో,

మానసికైక్యత అంత ముఖ్యము. అందు యెవరైన మృతిచెందిన వారిబంధము తెగిపోదు. సంతానము వివాహమువలన గలుగు ఫలమేగాని, వివాహమునకు హేతువు గాదు, ఇందుకు కారణము? ధర్మపాలనము. తాను సుఖపడుచు, యితరుల సుఖపెట్టుట గృహస్థుని ధర్మము.

గృహస్థుడు సుఖముగ నుండుటెట్లు?

౧. శరీరమును రోగములపాలు గాకుండ చూచుకొనుచు అనగా బ్రహ్మచర్యమునుగూర్చి విశేష ధ్యానముంచి ఆరోగ్యనియమముల పాలించుటవలన—

౨. మనస్సును శాంతముగను, ప్రసన్నముగను, ఉచ్చముగను, ఉదారముగను, స్నేహపూర్ణముగను, సుసంస్కృతముగను ఉంచుకొనుటవలన—

3. ఆత్మోన్నత్యము గావించుకొనుచు, అందరను ఆత్మస్వరూపులుగా నెంచుచు, సత్యము, నిష్ఠ, నిర్భయము, నమ్రత, దయ మొదలగు సద్గుణముల నలవరచుకొనుటవలన అనగా శరీరమును, మనస్సును, ఆత్మను ఐక్యపరచుటవలన; ఆత్మకు కళ్యాణప్రదముగతోచి, మనస్సునకు ప్రియమైనవానిని సాధించుటయందు శరీరమును వినియోగించుటవలన—

ఎవరైన దుఃఖపడుచున్న చూచి ఆత్మ జాలిపడి సహాయపడగోరిన మనస్సుగూడ అందుకు సమ్మతింపవలయును. శరీరమందుల కాతురత చెందవలెను. ఆత్మకు రోగులను చూచిన వారిసేవ చేయకుండనుండజాలని స్థితి రావలయును. మనమును సంఘమందలి దీన దరిద్రుల సేవ

యొనర్పకుండ ముందుకుబోవుస్థితి యుండరాదు. ధర్మపాలన కిదియే చరమసీమ. ధర్మముగ నార్జించినదను విశ్వాసముగల ధనము, నియమపూర్వకముగ గన్న సంతానమును, సద్గుణవంతులగు మిత్రులును సుఖమును పెంపొందింపగలరు. కాని సుఖసాధనములుకాదు- వారు సుఖమునకు శోభగలిగింతురు- అట్టివారు సువాసనాయుతమగు సువర్ణము వంటివారు.

### సమాజకళ్యాణము

ఇక సమాజకళ్యాణమునకు తోడ్పడుటెట్లు? మానవుడు వివాహమాడనంతవరకు ఒంటరిగ నెంచబడును. అంతవరకు అతడు వ్యక్తిగతకర్తవ్యములను గూర్చి యోచింపవచ్చును. కాని వివాహమాడుటతో నతడు సామాజికుడగును. కుటుంబ మొక చిన్నసమాజము. సమాజ మొక పెద్ద కుటుంబము. వివాహమైన పిమ్మట స్వార్థచింతతోపాటు కుటుంబచింతయు, భారమును నెత్తిన బడును. కుటుంబకష్టముల దూరముగావించుట, దురాచారముల రూపుమాపుట, అనాథలకు, దరిద్రులకు తోడ్పడుట పరోపకారము, అజ్ఞానమును పోగొట్టి విజ్ఞానప్రచారము గావించుట మొదలగు కార్యములవలన సంఘమునకు తోడ్పడుట.

ఇన్నికార్యముల నెత్తిన బెట్టుకొని నిర్వర్తించినపుడే వివాహము సార్థకమగును.

### వర్తమానరూపము

ఇపుడు మన దేశమునందున్న వివాహసంస్కారము ఇందుకు భిన్నముగనున్నది. మనవారిలో చాలమందికి

వివాహముయొక్క ఉద్దేశ్యములుగూడ తెలియవు. అందువలన ఈసంస్కారము చాల చెడిపోయినది. వివాహసంస్కార మొకముఖ్యమగు ధర్మవిధి. కాని నేడు దాని ధార్మికరూపము నియమరూపమున మాత్రమున్నది. లోకాచారములు మితిమీరిపోయినవి. వివాహమైన తరువాత వధూవరులు సామాజికజీవితమున ప్రవేశింతురు. అందుచేత ధార్మికసంస్కారములతోపాటు పలు సామాజికరీతులు—లోకాచారములు—కలిసి దాని నొక వినోదముగ మార్చినవి. ధార్మికదృష్టితో వివాహము కేవలము పాణిగ్రహణము. సప్తపది యని రెండువిధులుగలది. పాణిగ్రహణమువలన దాంపత్యసంబంధ మేర్పడి సప్తపదివలన నది దృఢపడును. తక్కినవన్నియు అనావశ్యకములు. పెద్దపెద్దవిందులు—సంతర్పణలు—కట్నములు— మేళతాళములు మొదలగు వినోదములన్నియు లోకాచారములు. సామాజికవిధులను సంఘమందలి పెద్దలు నిర్ణయింతురు. సమాజస్థితి నిరంతరము మారుచుండును. సమాజము తనకు హితములగువానిని గ్రహించి మిగిలినవానిని త్యజించును. అందులకై పోరాడుచుండును. ఇట్టి పరివర్తన సంఘమున నిరంతరము జరుగుచుండును. సంఘము దీనిపై నాధారపడియే నడచుచుండును. ఇదియే సంఘజీవితమునకు ప్రాణాధారము. పై వేషములు నిరంతరము మారుచుండును. తలపాగలుపోయి కుచ్చుటోపీలు; అవిపోయి ఖద్దరుటోపీలు వచ్చినవి. చెప్పులు రకరకముగ మారినవి. బ్రాహ్మణుల త్రికాలసంధ్యలు పోయినవి. కాని వారేదోవిధముగ నీశ్వరోపాసన చేయుచు

న్నారు. బాహ్యరూపమున మాత్రము భేదము కన్పట్టు చున్నది. అస్పృశ్యత అడుగంటి పోవుచున్నది. శాంతచిత్త ముతో క్షణకాలము పరిశీలించిన జీవితము క్షణక్షణము మారుచున్నట్లు గోచరించును. సమాజము బాహ్యము గను, ఆంతరంగికముగను మారుచున్నట్లు స్పష్టమగును. వివేకపూర్వముగ చేయు మార్పువలన లాభముకలుగును. గ్రుడ్డి అనుకరణమువలన అధోగతి పాలగుదుము. సంఘ మందలి పెద్దలు దేశకాలపాత్రముల ననుసరించి సాం ఘికరీతులను మార్చుచుండవలెను. ఇది పాపకార్యము గాదు. పుణ్యదాయకము. ధర్మసంస్కారమునకు సంబం ధింపక వృథావ్యయమూలకములైన వానిని ఆదా యము క్షీణించిపోయిన ఈదినములందు తొలగింపకున్న సంఘమున దురాచారము వ్యాపించును. వెనుకటి దినము లం దవి వివాహమునకు శోభాదాయకములుగ నుండిన నుండవచ్చును. కాని నేడందుకు మారుగ భారములై నష్టకారకములగుచున్నవి. ఇదియంతయు శ్రీమంతులకు గాదు—మాబోటిబీదలకు. మనసంఘమున శ్రీమంతులు కడు స్వల్పముగనున్నారు. తక్కిన సంఖ్యయంతయు బీదలు. శ్రీమంతులు బీదల కడగండ్లను గుర్తించుట ఉచితము. బీదలు శ్రీమంతుల ననుకరించగూడదు. ధనముసంగతి యటుండగ ఆ అశ్లీలపుమాటలు, ఆనృత్యము, ఆ అంగ భంగిమము, ఆఘోషా, ఆనగలు, ఆనాణెములు, ఆబాల్య వివాహములు, బహువివాహములు, వృద్ధవివాహములు మొదలగు భయంకర దుర్నీతులకు శ్రీమంతులు గూడ పాల్పడగూడదు. అవి ధనిక నిర్ధనిక భేదముల పాటింపక

మెల్లరను పీడించును. బ్రతికియుండగా తమ మనుమల పెండ్లి జూడవలెనని కసిగందుల గొంతుకోయుట, అప్పు చేసి శక్తికిమించి ఖర్చుపెట్టుట, కన్యావిక్రయములు, అనుచిత అధార్మిక మూఢాచారములు మొదలగు వాని నంత మొందించుట కందరును ధనిక బీద తారతమ్యమువూని పాటుపడవలయును. వధూవరుల ఇష్టానిష్టముల గుర్తింపక వివాహముచేయుటవలన ప్రబలహాని కలుగును. ఈ కారణముననే పలువురు దంపతులు సంసారయాత్రను యమయాతనవలె గడుపుచున్నారు. మనము మనోవేగముల నరికట్టి బుద్ధి, వివేకము, విచారము కలిగి వర్తింపవలెను. అట్లుచేయ నిచ్చగించియు పలువురు సంకోచము వలన అరికట్టబడి వివశులగుచున్నారు.

ఉపాయము

పురాతనపద్ధతులు హానికరములయినను వృద్ధులు వాని నెట్లంటిపెట్టుకొని యున్నారో అట్లే మనముగూడ మంచివని నమ్మిన వానిపై దృఢవిశ్వాసము గలిగియుండవలయును. వృద్ధులసేవ, వారితో నమ్రతగలిగి వర్తించుట మన ధర్మము. అట్లుచేయనిచో మనము యోగ్యుల మనిపించుకొనము. మంచిదని నమ్మినవిషయమును ఆచరణయందు పెట్టి దాని యుపయోగమును వెల్లడించుట మన విధి. వారికి నచ్చచెప్పుటగాని, ఆచరణయందు పెట్టుటగాని దాని యుపయోగమును వెల్లడించుటకు మార్గములు. వృద్ధులు మన కుదాహరణముగా నమ్మిన విషయముపై దృఢవిశ్వాసము గలవారై మావలె మీరును నమ్మిన విషయములపై దృఢవిశ్వాసము గలిగియుండుడని

పాఠము నేర్పుచున్నారు. పెద్దలు విచారవంతులు, వివేకవంతులు. తగుసమయమున మేల్కొందురు. మనము ముందుండి ఆదోషముల నివారింతము.

---

౯

# నూతన దంపతులకు

నూతనదంపతులకు దాంపత్యసంబంధమగు కష్టములనేకములు గలుగుచుండును. కొందరు జగడమాడుకొనుచుందురు. కొందరిమధ్య యితరులు కయ్యముల గల్పించి గృహజీవితమును క్లేశమయము గావింతురు. పలుచోట్ల తలిదండ్రులకు, వారికి తగవులు వచ్చుచుండును. పిన్నవయస్సుననే కొందరు మాతాపితల స్థానమధిష్ఠించి దుఃఖించుచుందురు. మరికొందరు గుప్తరోగములకు లోనై కుములుచుందురు. తరచు బాల్యవివాహములవలన నిట్టి దుష్ఫలితములు గలుగుచుండును.

అసలు వారికి సాంఘికపరిస్థితులలోగాని, ప్రపంచ పరిస్థితులలోగాని లేశమాత్రజ్ఞాన మైనను లేదు. దానికితోడు నియమరహితమగు సామాజిక మర్యాద తల్లిదండ్రుల కట్టుదిట్టములతో బంధించును. వారు కష్టముల బడి, అంధకారబంధురమగు దిక్కులయందు తెన్నుగానక కొట్టుకొనుచుందురు. వారి కితరులవలన తగుసహాయము లభింపదు. ధూర్తులు, స్వార్థపరులు వారిని మోసగించి స్వలాభములపొందుచు వారినింకను కష్టముల పాలొనర్తురు. ఇట్టివి ధనికులయం దెక్కువగ నుండును. వారి ధన

ము, ఐశ్వర్యము ధనార్థుల, స్తోత్రపాఠకుల పాలగును. అట్టివారి లాభమునకై కొన్ని వ్యవహారికనియమముల నిట వ్రాయుచున్నాను.

౧. వారు ప్రథమమున చేయదగ్గది పరస్పర ప్రేమను పెంపెందించుకొనుట. వారు ఒకరినొకరు గౌర వించుకొనుచు, దోషములను ఉదారభావముతోను, పర స్పరసహకారముతోను దూరమొనర్చు కొనుచుండ వలెను. వారు తమకుగల విభేదముల తొలగించుకొన వలెను. ప్రేమను పెంపొందించుకొనుట యనగా రాత్రిం దివములు భోగవిలాసములనుగూర్చి చర్చించుటయని తలంపరాదు. వారియందు అభిన్నభావ మేర్పడవలెను. వారిలో నెవరిది తప్పైనను, ఎవరికి కష్టముగలిగినను నెవరికి వారు తమ తప్పుగను, కష్టముగను తలంపవల యును. వారిద్దరు పరస్పరమిత్రులుగను, శ్రేయోభిలా షులుగను మెలగవలయును. స్వాభావికదోషముల, పొర పాటుల దిద్దుకొని నడువవలయును.

౨. ఇతరులు తమలో నెవరినిగూర్చి ఏమిచెప్పి నను నమ్మగూడదు. ఒకవేళ నమ్మినను త్వరపడక సావ ధానముగ మెలగవలయును. ప్రవర్తనవిషయములో చె ప్పుడు మాటలనుబట్టి వేగిరపడక శాంతచిత్తముతో యోచించి పనిచేయవలెను. అట్టి వినికిడిమాటలు అత్యు క్తులతోను, అనుదారత్వముతోను నిండియుండును. అట్టి స్థితి గలుగకుండుటకు కపటమును విడనాడవలెను. ఎవరికెట్టి చెడు తలంపుగలిగినను పరస్పరము చర్చించు కొనునంతటి హృదయైక్యత యేర్పడవలయును. విశ్వాస

ముతో చెప్పినమాటలను ప్రాణరక్షణకువలె రక్షించు కొనువలెను.

3. నైతికపు పొరపాట్లు అన్నిటినిమించి ముప్పును కలిగించును. మన సంఘము స్త్రీలపొరబాటును దోష ముగ పరిగణించినట్టు పురుషుల విషయమున పరిగణిం పదు. చెడుగు యెవరివలనజరిగినను అది సమానమే యగును. పొరపాటునకు ప్రాయశ్చిత్తమేమందు. బుద్ధి పూర్వకముగజరిగిన తప్పిదముగూర్చి గంభీరముగ యో చింపవలెను. వారి సాంగత్యము, సాహిత్యమందభిరుచి, ఆహారవిహారము. గృహపరిసరములు ఏపాటివో యో చించి ఆదోషముల పోగొట్టుకొన యత్నింపవలెను. సాధ్య పడనిచో బహిష్కారము లేక బంధవిచ్ఛేదము గావించు కొనవలెను. బలవంతమునజరిగిన దోషి బలవంతము చేసిన వాడు. అవి మహోద్రేకమును గలిగించు సమయములు. కాని అపుడే శాంతముగను, ధైర్యముగను, గంభీరము గను మెలంగవలయును. నూతనదంపతు లిట్టితరి కర్తవ్య విమూఢులగుదురు. అనుభవముగల విశ్వాసపాత్రుల సల హాలను పొందవలెను. చెప్పుడుమాటలను చెవివద్దకు చేర నీయగూడదు. ఇతరులతో నట్టి నిష్ప్రయోజకములగు విషయముల తర్కింపగూడదు.

౪. నూతనదంపతులు తమ పెద్దలనుగాని, గొప్ప వారినిగాని విశ్వాసపాత్రులుగను, పథప్రదర్శకులుగను నుంచుకొనవలెను. తమ చిక్కులను వారికి నివేదించి తగు సలహాలను పొందవలయును. లజ్జా వశవర్తులై తమ చెడు గులను తమయందే యుంచుకొని వాటికి యెఱవై, గృహ

సమాజములను కలుషిత మొనర్పగూడదు. లోలోపల వారియాత్మ క్రృంగి కృశించును. రోగములపాలై దుఃఖ పడుదురుగాన ఎంతటి రహస్యమైనను యోగ్యులకు చెప్పి తగు సలహా పొందవలెను.

౫. వివాహమైన పిమ్మట తగు వయసురాగానే దంపతులిద్దరు కలిసి యుండవలెను. దూరముగనుండ గూడదు. కలిసి నివసించుచు సాధ్యమైనంతవఱకు నిగ్ర హముతో నుండవలెను. నిగ్రహశక్తికి భయపడి, ఖర్చుకు వెఱచి దూరముగ నుండగూడదు.

౬. గుప్తరోగములనుండి ఒండొరుల రక్షించుకొన వలెను. ఆహారవిహారాదులయందు తగు జాగ్రత్త వహింపనందున, ఇంద్రియనిగ్రహము లేనందున, మురుగుడు ప్రదేశములయందు నివసించుటవలన, వేశ్యాసంప ర్కమువలన అట్టిరోగములు గలుగును. స్వచ్ఛమగు తేలికయగు నాహారము, పరిశుభ్రత, అట్టి రోగములను పోగొట్టును. ప్రకటనమందులజూచి మోసపోరాదు.

౭. అశ్లీలములై, కామోద్రేకమును రేకెత్తించు విలాసగ్రంథ పఠనము మానవలెను. అట్టినాటకములను, సినీమాలను, చిత్రపటములను చూడగూడదు. అట్టి చర్చలకు దూరముగ నుండవలెను.

౮. భార్య రుచిననుసరించి ఆమెకు ఆసక్తిగల విషయములయందు అభివృద్ధికి తేవలయును. తగు జ్ఞానమును గలిగింపవలయును. తమ జీవితవిధాననిర్మాణమునకు, అంగీకృతకార్యనిర్వహణమునకు తత్పరత వహించి యుండవలెను.

## ౧౦

# పత్నీవ్రతధర్మము

ఈవ్యాసమును చూచి సోదరీమణులు సంతోషింతురని తలంతును. ప్రాచీనకాలమున పురుషులు స్త్రీలను అణచివేసిరను నేరమారోపించు సోదరీమణులు ఆనందమగ్నలు కావచ్చును. స్త్రీలు తమకు బానిసలని తలంచు సోదరు లిట్లు వ్రాసినందులకు నన్ను దూషింపవచ్చును. అణగియుండుట, అణచివేయుట అనుచర్చ అటుంచి నేటి స్త్రీపురుష సంబంధములను, ప్రస్తుత మాచరణయందున్న పెక్కువిషయములను గమనించిన వానినిగూర్చి నూతనదృష్టితో విచారింపవలసిన అవసరమేర్పడినది.

స్త్రీపురుషులు రెండుశక్తులు. వేరువేరుగగాని, సమ్మిళితముగగాని వారి బలము, గుణము సంఘముకొఱకు, వ్యక్తులకొఱకు వినియోగపడవలెను. రెండు గుణములు, శక్తులు సమముగా వికసించనియెడల తగువిధమున నుపయోగపడవు. పక్షికొకరెక్క దుర్బలమైన దాని జీవితము నిరర్థకమగును. బండిచక్రములు రెండును సమముగ నుండనియెడల నాబండి నడువదు. హిందూసంఘమున స్త్రీలకన్న పురుషులు పలువిషయములయందౌన్నత్యముబొంది స్వతంత్రులై, బలవంతులుగనున్నారు. ధర్మమందిరముల వారి "జయజయ" రావములు మిన్నుముట్టుచున్నవి. సాహిత్యకళ వారి యాదరసత్కారము

లతో నిండిపొర్లుచున్నది. శిక్షలయందు, దీక్షలయందు వారి కధికాధిక్యత లభించియున్నది. స్త్రీలు చదువుకొనుటకు స్వతంత్రముగాని, ఇల్లువదలి బయటకు వెడలుటకు వీలుగాని లేదు. ఘోషాలు, తెరలు వారిని నాగపాశమువలె బంధించియున్నవి. వంట, శిశుపోషణమాత్రమే స్త్రీలపని. జీవితమునగల ఈవిషమత్వమును దూరముగావించిననే దప్ప హిందూసంఘమునకు ముక్తి లేదు. దేశకాలపాత్రముల నెరిగి పురుషులు స్త్రీల యభ్యుదయమునకై కృషిసలుప వలసియున్నది. పురుషులెంత బలవంతులుగ నున్నను, ప్రతిభావంతులుగనున్నను దుర్గుణములయందు స్త్రీలను మించియున్నారు. అంతర్జగత్తుతో సంబంధముండి, గుణసౌందర్యములతో కూడిన విషయములందు స్త్రీలు పురుషులను మించియున్నారు. పురుషుల లౌకికజీవితము అధికాకర్షణీయముగ, ఉపయోగకరముగ నున్నను వ్యక్తిజీవితము అధికదోషయుక్తమై కలుషితముగ నున్నది. సామాజిక ప్రభుత్వమున నాతడు సంఘమునకు లాభము చేకూర్చ గలిగినను వ్యక్తిగతజీవితమున స్త్రీలకన్న వెనుకబడియే యున్నారు. స్త్రీల ఉచ్చగుణములవలన, దేశమునకు సమాజమునకుగల్గు లాభము అల్పము. కాని వ్యక్తిగత జీవితమున వారు వాని నున్నతపథమున నధిష్ఠింపజేతురు. బుద్ధిచాతుర్యమువలన సమాజమున పురుషు లెంత ఆధిక్యత గడించినను వ్యక్తిగతజీవితము రోగచింతలయందు, భోగవిలాసములయందు, భయభ్రాంతులయందు గడచిపోవును. ఇపుడు పురుషుల జీవితము అధికముగ వ్యక్తిగత మొనర్చి పవిత్ర మొనరింపవలసి యున్నది. స్త్రీజీవితమును సామా

జికకార్యములందు అధికముగ వినియోగింపవలసియు న్నది. స్త్రీపురుషుల జీవితముల నిట్లు సమంజసపరుపకున్న వారికిగాని, సంఘమునకుగాని సుఖముగలుగదు.

ఇది స్త్రీపురుషుల జీవితమును గూర్చిన సాధారణ విషయము. ఇక వారి పరస్పరసంబంధములగూర్చి చర్చిం తము. స్త్రీ పురుషునికన్న కర్తవ్యపరాయణత్వమును బాగుగ గుర్తించును. పురుషుడు సామాజికప్రభుత్వము వలన, అనేకవిధములగు వస్తువులవలన, పలురకముల మనుష్యసంపర్కమువలన నిజాయితిగలిగి ఆడినమాట తప్పకుండ నుండజాలడు. స్త్రీలు వ్యక్తిగతజీవితమున స్వభావసిద్ధముగా స్వరక్షణశీలలగుటవలన నట్లుచేయరు. నేడు మన సంఘము ఒడిదుడుకులనుండి ఒడ్డున బడవలె నన్న పురుషజీవిత ముచ్చముగను, సాత్వికముగను మారవలెను. నేటివరకు పురుషులు స్త్రీల కర్తవ్యములగూర్చి జబర్దస్తీ చేయుచుండిరి. వారి పవిత్రత, పాతివ్రత్యము, నిజాయితి మనపవిత్రతకు మూలాధారములుగ నెంచుచుం టిమి. ఇపుడు పురుషుడు తన కర్తవ్యముల గుర్తింపవల సిన సమయ మాసన్నమైనది. వ్యభిచారి, దురాచారి, అత్యాచారియగు పురుషుల నోటినుండి పాతివ్రత్యమును, పాతివ్రత్యమహిమనుగూర్చిన ఫొగడ్తలు వానికి శోభను కలిగించవు. మనసోదరీమణులు అగ్నిపరీక్షలో తపముచేసి మేలిమిబంగారములని వ్యక్తపరచిరి. ఇక పురుషులవంతు మిగిలియున్నది. వారిపరీక్ష త్వరలోనే జరుగనున్నది. ఇక నాతడు పత్నీవ్రతధర్మమును గురించి వ్రాయవలసి యు న్నది. స్మృతులు, కథలు, పత్నీవ్రతోపదేశములతో నిండి

యుండియున్నవి. పత్నీవ్రతమనగా భార్యతో నిజాయితి కలిగి మెలంగుట. స్త్రీలు తమభర్తలను పరమేశ్వరునిగ పూజించినట్లు, పురుషులు తమభార్యలను దేవీమణులుగ భావించి, ఆదరించి వారి విశాసమునకు తోడ్పడవలెను. సప్తపదిసమయమున తానుచేసిన బాసలను ఏకనిష్ఠతో పాలించవలయును.

ఇట్లు స్త్రీలజీవితమును సమాజశీలముగ నొనర్ప కుండ, పురుషులజీవితమును పత్నీవ్రతదీక్షలతో నింప కుండ హిందూసంఘ ముద్ధరింపబడదు. పురుషు లిప్పు డిప్పుడే తమయందున్న లోపములను గుర్తించుచున్నారు. స్త్రీలుగూడ ఆందోళన జరుపుట సంతోషదాయకము. దాని ఫలిత మందరకును లాభదాయకముగ నుండగలదు ఇందుల కెట్టి సంశయమును నక్కరలేదు.

---

## ౧౧
## కవి : కవిత్వము

కావ్యము, కవిత్వము, కవితయను మూడురూప ములు కవిశబ్దమునకు సంబంధించినవి. ఈ మూడు శబ్ద ములు ఒకేమూలార్థమునిచ్చుచున్నవి. 'కవి' యను విశే షణమునకు భిన్నభిన్న ప్రత్యయములను చేర్చుటవలన పైన చెప్పబడిన మూడు భావవాచకశబ్దము లేర్పడు చున్నవి. కాని నేడు వానిని వేరువేరుగ వ్యాఖ్యానములు చేయుచున్నారు. 'కావ్య' శబ్దము కవిత్వగ్రంథములని

అర్థమిచ్చును. అవి సాహిత్యశాల లేక కావ్యనియమముల ననుసరించి రచింపబడినవి. 'కవిత్వము' 'కవి' శబ్దమునకు భావవాచకము. కవిత్వముతోనిండి కావ్యశాస్త్రాను సారము రసము, చమత్కారము, ధ్వని గలిగిన పద్యములను, పద్యసమూహమును కవితలందుము. నేనీవ్యాసమందు కావ్యశాస్త్రచర్చను మాని 'కవిత' యన నేమియో చర్చింతును.

ప్రజలు తరచు ప్రాసలు, గణములు గలవన్నియు కవితలని తలంచుచున్నారు. కాని కవిత్వ మింతటి తేలిక వస్తువుగాదు. ఛందశ్శాస్త్రపఠనమువలన కవిత్వధార యేర్పడదు. ఛందశ్శాస్త్రము పద్యమున శబ్దనిర్మాణ మెట్లుండవలెనో తెలుపును. కావ్యశాస్త్రపఠనమువలన యెవరికి కావ్యరచనాసామర్థ్య మేర్పడదు. కావ్యశాస్త్రము మానవునికి కవిత్వమం దభిరుచిగలిగించును. కవిత్వము హృదయమునకు సంబంధించినది. సహృదయులే కవిత్వము చెప్పగలరు. కవిత్వమును పరీక్షించగలరు. కవిత్వధోరణి సహజముగ పుట్టును. అది ప్రయత్నమువలన రాదు. మానవునియందు ప్రతిభ సుప్తరూపముననున్న కావ్యగ్రంథపరిచయమువలన నది జాగృతినందును.

ఏదైన వస్తువు తెలపునకు వచ్చినపుడు, ఏదృశ్యమునైన గాంచినపుడు, ఏవిషయమును గురించియైన తలంచినపుడు మానవుని హృదయమందు భిన్నభిన్నములగు అనేకభావము లుత్పన్నమగును. దేవాలయమున కేగిన భక్తిభావములు; స్మశానమున మండుచున్న చితిని చూచి కరుణారసముగాని, వైరాగ్యముగాని ఉప్పతిలును.

అత్యాచారముల చూచినపుడు క్రోధ ముత్పన్నమగును. ఎపు డెట్టి దృశ్యముల గాంతుమో అపుడట్టి భావములు గలుగనిచో వానిని సహృదయుడనజాలము. ఎవనిభావ ములు ఉత్థాన, పతన రహితములో వాడు కవి కాజా లడు—కవిత్వము చెప్పజాలడు. సహృదయత్వము మాన వునియందు కవిత్వము చెప్పగల సామర్థ్యమున్నదని తెలు పును. కాని హృదయమం దిమిడియున్న భావముల బహి ర్గత మొనర్పగలిగినపుడే యితడు కవియనబడును. వాని యందు కవిహృదయ మున్నను భావప్రకటన లేనంత వఱకు కవియని చెప్పబడడు. తెలతోకలు లేకుండ అడ్డు దిడ్డముగా వ్యక్తపరచు భావములు కవిత్వమనబడదు. భావప్రకటన శ్రోతల నాకర్షించుచు ఆయాఘటనలు, దృశ్యములు వారిహృదయముల ప్రతిబింబించవలెను. ఈ భావప్రకటనాకౌశలమును కావ్యశాస్త్రమున కావ్యకళ యందురు. ఇందే చమత్కారము, ధ్వని, శబ్దము, భావ ము మిళితమైయుండును, కవిత్వగతభావప్రతిబింబములు హృదయమున చొచ్చి కలిగించు అలౌకికానందమునే కావ్యశాస్త్రమున "రస" మందురు.

ఇందువలన కవిత్వమనగా భావభరితమై, పాఠకుల శ్రోతల హృదయముల అంకితమై ప్రతిబింబించు వాక్య మను నిశ్చయాభిప్రాయమునకు వచ్చుచున్నాము. శబ్ద రూపమున ప్రవహించు హృదయమందలి భావప్రవాహ మునే కవిత్వమందుము.

మానవసృష్టియందు మానవుని హృదయము, అందు ప్రవహించు వివిధభావములకువలె కవిత్వముగూడ

అతిప్రాచీనమైనది. ప్రథమమున కవిత్వము ఛందోబద్ధముగ నుండలేదు. మానవహృదయ మాందోళిత మైనపుడు, తత్పరత చెందినపుడు వెలువడిన భావముల ననుసరించి, దాని లయ ననుసరించి ఛందస్సు రచింపబడినది. భాషకు వ్యాకరణమువలె, కవిత్వమునకు ఛందస్సు ముఖ్యమైనను అది కవిత్వమునకు ఆత్మగాని, ప్రాణముగాని గాక కళేబరమును బోలియుండును.

ప్రకృతిసౌందర్యము వేరు. మానవుని సౌందర్యసంపద వేరు. ప్రకృతి తన సహజసుందరరూపమున తన వైభవమును వ్యాపింపజేయును. మానవుడు తన యిచ్ఛ వచ్చినట్లు దానిని మార్ప యత్నించును. ప్రకృతి భండారము అక్షయమై అంతులేనిదిగ నున్నది. మానవునిశక్తి పరిమితమై యుండును. మానవుడు ప్రకృతియందొక ఆటబొమ్మ. ప్రకృతిని తమ వశమొనర్చుకొనగల సమర్థులు వారియందున్నారు. అట్టివారు ప్రకృతిసౌందర్యమును భిన్నభిన్నము గావింపరు. ప్రకృతిపై తమయాధిపత్యమును నెలకొల్పి తమ యంతరాత్మ నందు వ్యాపింపజేతురు. వారు రాగముల, ఛందస్సుల, రేఖల చింతల యందుబడి కొట్టుకొనరు. వారు కావ్య, సంగీతకళలకు మూలమగు ఆత్మను సంస్కరింతురు. అందు నూతనజీవితమును, నవీనతేజమును, క్రొత్తరూపమును గలిగింతురు. అట్టివారు మహాకవులనబడుదురు. వారి మహాకావ్యముల యెదుట అష్టాదశసర్గలతోనిండి, ప్రభాతసంధ్యావర్ణనల చింతలో చివికిపోయిన, పర్వతముల యందు, నదులయందు, కందరములయందు భ్రమించుచు,

సంయోగవియోగములతో నిండిన ఈ ఉప్పచప్పని కవులు వారి గ్రంథములు దిష్టిబొమ్మలు. మహాకవి విధాత. అతడు అపరఈశ్వరరూపము. అతడు నూతనప్రపంచమును సృష్టించును. నవీనజీవితమును, నూతనాకాంక్షలను మొలకెత్తించును. అతడు త్రికాలద్రష్ట. ఆతడు భూతకాల అస్తికలపై పాదమువోపి, వర్తమాన జటిలసమస్యలను పరిష్కరించుచు, భవిష్యస్సందేశ మొసంగి దారి చూపును. వాని శిరస్సు ఆకాశమున, పాదములు జనసామాన్యమున, బాహులు నలుదిశలను వ్యాపించియుండును. అతడు ఆకాశమున కూర్చుండి, సృష్టియందలి గూఢతమ అవ్యక్తవిషయములను, సంఘమందలి కట్టుకథలను, మానవసంఘపు పుట్టుపూర్వోత్తరములను తన అంతశ్చక్షువులద్వారా వీక్షించును. సంఘమునగలిసి, దానిని లేవగొట్టి జాగృతిగావించును. రాత్రిందివములు, మారుమూలల తనగానముల, రోదనముల వ్యాపింపజేయును. రోదనమొనర్చి మానవహృదయమును వ్యాకులమొనర్చును. గానమొనర్చి యావ్యాకులతను శాంతపరుచును. వానిగానము, రోదనము, పరస్పరసంబంధము గలిగియుండును. అతడు రోదనమొనర్చుచు వికసితవదనుడగును. గానమొనర్చుచు రోదనము నొనర్చును. అతడు చిత్తవిభ్రాంతి నందియుండును. విశ్వవేదన మాతని హృదయమును వికలమొనర్చి ఉబ్బూతలూపును. వానినోటి నుండి బయలుదేరు "ఉఫ్"మను ధ్వనియే కావ్యము. వాని గర్జనవలన బ్రహ్మాండము కంపించును—ఇదియే కావ్యమహిమ. కవికరుణయే కవిత్వము. ఆదికవి వాల్మీకి

చచ్చిపోవుచున్న క్రౌంచపక్షిని చూచెను. హృదయము నుండి కరుణయుప్పొంగెను. కరుణ కవిత్వరూపమున ప్రవహించెను.

అట్టి మహాకవులు ప్రపంచమున స్వల్పముగ నుందురు. ప్రపంచమునకు సందేశమొసంగుటకు వారుద్భవింతురు. అంతటి అవసరముగలిగినపుడే వారీలోకమున జన్మింతురు. సంఘము ప్రతిబంధకములకు లోనై, దార్జన్యముల పాలైనపుడు వానిని దూరమొనర్చుటకు వారేతెంతురు. వారి కరుణయే కవిత్వము; క్రాంతియే కావ్యము. వారు అమూల్యమైనవారై, సాటిలేక అప్రాప్యముగ నుందురు. ఇపుడు ప్రపంచమున కవుల మనుకొను వారు పలువురున్నారు. ఛందస్సు, కావ్యశాస్త్రముల పఠించి పద్యరచనచేయుట వీరిపని. కవిత్వమునకు మూలము హృదయము, మస్తిష్కముగాదు. మస్తిష్కము పని చూచుట హృదయము పనివ్రాయుట. ఇట్టిదే నిజమగు కవిత్వము. కవిత్వము పాఠకుని తన్మయునిగావించును. కవిత్వము యేడ్చిన అతడును యేడ్చును. అది కిలకిలనవ్విన నాతడు పకపకనవ్వును. అది పరుగెత్తిన నాతడును పరుగెత్తును. అంతటి శక్తిగలదే నిజమగు కవిత్వము. కవిత్వము కవిహృదయమందలి ప్రతిధ్వని. ప్రబల ప్రవాహము. అది యెదుటనున్న వానిని మస్తునిగావించి తనతో ప్రవహింపజేయును కవి దూరదృష్టితో అంతస్థలమున వ్రాసినపుడిట్టి కవిత్వ మేర్పడును. కవివిగావలెనన్న మస్తిష్కమును పరుగెత్తించుము. హృదయమును ఉద్భూతలూగించుము. ఛందస్సు, కావ్యము మస్తిష్కమునుండి

యుద్భవించినవి, ఇవి కవిత్వమునకు ఆధారములు గావు. కవిత్వమునకు ప్రతిభ, మౌలికత్వము అవసరము. లోపల నున్నంతవరకు ప్రతిభయని, బయటపడిన వెంటనే దానిని కవిత్వమని యందురు.

కవి ప్రతిభ అనేకదృశ్యముల వీక్షించును. అపుడు వానియం దనేక భావము లుత్పన్నమగును. ఆభావములు వాగ్రూపము లేక వ్రాతరూపమును ధరించినపుడు కవిత్వ మందుము. కవిత్వమునందుండు హృదయహరణశక్తిని, సామర్థ్యమును రసమందుము, కవిత్వమందలి భావప్రభావము ననుసరించి రసపరిపాకముండును. భారతీయకావ్య శాస్త్ర మర్మజ్ఞులు రసములను శృంగార, వీర, కరుణ, రౌద్ర, హాస్య, బీభత్స, భయానక, అద్భుత, శాంత రసములని తొమ్మిదివిధములుగ విభాగించిరి. కొందరు శృంగారరసమునకు, మరికొందరు శాంతరసమునకు ప్రాధాన్య మిత్తురు. పతి, పత్నుల సంయోగ, వియోగ వర్ణనల వలన శృంగారరస మేర్పడును. పీడిత, పతిత, దీన దరిద్రుల కష్టముల, శోకముల వర్ణించుటవలన కరుణారస మేర్పడును. శృంగారరసమునకు మూలము ప్రేమ. అది రెండు హృదయముల నభిన్నముగ మార్చును. కాని మన కవులు దానికి విషయరూపమును కలుగచేసిరి. మానవహృదయ మందలి నిర్మలమును, ఉచ్చమును అగు భావ మట్టి కవుల చేతులలోబడి నాయికానాయకుల భోగసామాగ్రియైనది. మనస్సు సంస్కారపూరితము కానందున ప్రేమకు భోగ రూపధారణ మొనర్చుట జరుగును. ప్రేమయనగా మనోగతమగు శుద్ధసాత్వికానందము. అందు ప్రేమికి సేవయొన

ర్చుట, సహాయపడుట మొదలగు అభిలాషలుండును. భోగము ఇంద్రియవాసనతో కూడియున్నది. ప్రేమ దైవికభావముగలది. భోగము పైశాచికభావయుతము. ప్రేమయం దొకరికై నొకరి నర్పణగావించు శక్తియున్నది. భోగము పరాధీన మొనర్చును. ఇద్దరు పురుషుల మధ్య నుండు ప్రేమకును; ఒక స్త్రీ, ఒకపురుషునకు మధ్యనుండు ప్రేమకును తారతమ్యమున్నది. స్త్రీపురుషుల మధ్య నుండు ప్రేమయందు స్త్రీల సౌందర్యాకర్షణ మెందుగ నుండును. అట్టిప్రేమ భోగముగ పరిణమించును. స్వచ్ఛ మగు ప్రేమకు స్త్రీలతోగాని, వ్యక్తులతోగాని సంబంధ ముండదు. ప్రేమకు వ్యక్తులు అధిష్ఠాతలుగారు. సిద్ధాంతము, ఆదర్శము. దేశము ప్రేమ కాధారములుగ నెందు కుండగూడదు? ప్రియతమకై యేడ్చి వెఱ్ఱిచెందు టెందులకు? మనము నిజబుద్ధితో సత్యమునకు, స్వాతంత్ర్యమునకు, దేశహితమునకు దుఃఖింతము. రోదనము గావింతము, ప్రాణ మర్పింతము, సర్వము ధారపోతము. కాని మన పరంపరాగతమగు శృంగారరసమున దీనికి స్థానమున్నదా? అది వ్యభిచారమును సైతము ఒప్పుకొనును. మనోవికారమే అచటిప్రేమ. దానితృప్తియే అలౌకికానందము. ఆ అలౌకికానందమే రసము. నాయికానాయకభేదజ్ఞానమేమాత్రమున్నను దానిని గ్రహించవచ్చును. శృంగార రసమునకు బదులు ప్రేమరసనిర్మాణము గావించవలసి యున్నది. దానిని భోగవిలాసములను మురుగుడు గుంటల నుండి మనోగతసాత్వికానందమను గంగోత్రియందు ప్రతిష్ఠించవచెను. కవులిట్టి నిర్మలప్రేమప్రేరితులై గాన

మొనర్చినవారు ప్రపంచమును సౌందర్యస్ఫూర్తితో వెలుగొందజేసి ప్రపంచసేవ యొనర్చిన వారగుదురు. నిర్మల ప్రేమ పాలసముద్రము. అమృతధార సవికారప్రేమ ఉన్మాదము. మద్యపానసరోవరము, హాలాహలకుండము.

ఇతరుల దుఃఖకష్టములను; శోక, క్లేశ, సంతాప, అనుతాప, నిరాశలచూచి మానవహృదయమందున్న కోమల తమ అంశమునుండి కరుణరస ముత్పన్నమగును. ప్రేమరసము తనలోటును పూర్తిగావించుటకు యితరులకై పరుగెత్తును. కరుణరసము ఇతరులయందున్న లోటు దీర్ప తత్పరత వహించియుండును. ప్రేమరసమునకన్న కరుణరసము శ్రేష్ఠము. ఇక నేటి శృంగారరసమును గూర్చి చర్చింప బూనుకొనను. మానవుడు సంపూర్ణత గాంచుటకు ప్రేమ, కరుణరసములే శరణ్యములు. శాంతరసము ప్రేమరసాంతర్గతము. వీరరసము ప్రేమ- కరుణరసముల పరిపక్వఫలము. తక్కినహాస్య, బీభత్స, అద్భుత, భయానక, రౌద్రరసములు సాహిత్యమునకు శోభ గలిగించినను మానవవికాసమున కవసరములుగావు. ప్రియవస్తుప్రాప్తికి, సేవకు, సహాయమునకు, దీనదరిద్రుల సహాయమునకు అనగా సమాజదేశహితములకు మానవుడు చేయు బృహత్ప్రయత్నములయందు, పరాక్రమ ప్రదర్శనమందు, వీరరస ముత్పన్నమగును. హృదయమున సంవేదనాశీలత్వ ముండుట మానవుని ప్రథమలక్షణము. హృదయ మున్నవాడే కవి.

తన ఆకలితీర్చుకొనుటకు తగు అధిష్ఠానమును

కోరువాడు ప్రేమి. ఇతరుల కష్టములచూచి దుఃఖపడువాడు కరుణామయుడు. పరులసేవ, సహాయమునకై తను, మనో ధనములతో యత్నించి యితరులకై కష్టముల నెదుర్చు వాడు వీరుడు. ప్రేమివి కమ్ము! దయావంతుడవు కమ్ము! వీరుడవు కమ్ము! కవితాదేవిని ఆరాధించదలచిన విశ్వ ప్రేమతో విహ్వాలుడవై, మానవుల నెదుర్కొనుచున్న కష్టముల తొలగించ నీ సర్వస్వము నర్పించియైనను పాటు పడ సిద్ధముగనుండుము. తత్పరత, తన్మయత్వము, ఉన్మత్తత లేనంతవఱకు నిజమగు కవివి కానేఱవు. కవివి కాద లచిన ఉన్మత్తుడవుకమ్ము. నిన్ను నీవు మఱచిపొమ్ము. సమష్ఠి కధీనమై, ఉన్మత్తుడవై నీవు వ్రాసినదే, పాడి నదే, నృత్యము చేసినదే కవిత్వము, కళయగును. హృద యమం దిమిడియున్న తథ్యమగు సత్యమును ప్రకటించు టకు—నీ సందేశమును ప్రపంచమున చాటుటకు—వికలుడవై, అధీరతచెంది నిట్టూర్పులు విడిచినప్పుడు కవిత్వ ధోరణి యేర్పడును. హృదయమందలి సుందరసుకు మారవిచారములు, మస్తిష్కమందలి పవిత్రవిచార ములు, శరీరపరాక్రమము, ఆత్మబలము ఇతరులకు ప్రసాదించుటకు ఉత్కంఠత జెందినపుడు, అందులకు శరీ రము తత్పరమైనప్పుడు కతవ్యము చెప్పగలుగుదువు— అప్పుడు నీశరీరమందలి ప్రతిరోమము కవిపదప్రాప్తి నంద గలదు. కవిమహిమ అనిర్వాచనీయము. ఈ సృష్టి మహా కవియొక్క మహాకావ్యము. ఈవాక్యమందే కవి—కా వ్యము వీని మహత్వ మిమిడియున్నది.

---

## ౧౨
# కళావిచారము

అది సాహిత్యక్షేత్రమున ప్రసిద్ధికెక్కిన పత్రిక. సుసంస్కృతుడగు నామిత్రుడు దాని ముఖపత్రమందలి చిత్రమును చూచి చూడకముందే ఆతనినోటినుండి 'ఎంతటి అసహ్యపు ముఖపత్రము. అందే మాత్రమును కళ లేదు.' అనుమాటలు ఉద్గారితమైనవి.

మరియొక కళా విశారదుడగు మిత్రుడు కళావిహూపత్వము కళ యెప్పటికినిగాదు అనెను. మూడవ కళాప్రేమి ఇది చాల అసంభవము అనెను. అట్టిమాటలు విన్నప్పుడు దుఃఖము వేయుచుండును. కానివస్తుస్థితి అట్టిదగుటవలన ఒప్పుకొనకతప్పదు. కళనుగూర్చి చర్చలు అరుదు. ఏకొద్దిగనైనను జరిగినను. అది సాధారణ జనులకనభిజ్ఞమగుటవలన అందరు అందలి రసమును ఆస్వాదనము చేయజాలకున్నారు. కావున కళాతత్వమును గురించి నిరంతరము చర్చలు జరుగుచుండవలెను. ఇట్టి దృష్టితో కళావిచారమను నీవ్యాసమును వ్రాసితిని.

కళయను శబ్దమునకు విద్యయని శాస్త్రమని కౌశలమని- ఈరెండును సర్వసాధారణమగు- అర్థములు. కాని కళకు దీనిని మించి గంభీరమగు అర్థముకలదు. ఒకరిభావముల నొకరిహృదయమున నుద్దీప్తమొనర్చు విద్యను కళ యందురు. భాష ఒకరిహృదయమందలి భావముల మరియొకరికి వ్యక్తపరుచునట్లు కళగూడ ఒకరి హృదయము

లోని భావములను మరియొకరి హృదయమున చేర్చును. హృదయమునుండి బహిర్గతములగు శోక, ఆనంద, విస్మయ, కరుణలు మొదలగు భావములను ఇతరులయందు వెలుగొందచేయువాడు కళాకారుడు. కళాకారుల ఉపకరణములు భిన్నభిన్నముగ నుండును. కొందరు తమస్వరము యొక్క విశిష్టరచన వలన, కొందరు తమ అంగవిక్షేపముద్వారా, ఇంకను కొందరు తమకుంచెవలన, పలువురు తమ వాణివలన తమహృదయములోని భావములను వ్యక్తపరుతురు. కొంతమంది కళాధరులకు స్వరము ఉపకరణము. కొందరకు కలము. ఇంకను కొందరకు వాణి. స్వరము వలన కళాపరిచయ మొనర్చువానిని గాయకుడని, అంగవిక్షేపముద్వారా పరిచయమొనర్చువానిని నటుడని, కుంచెవలన పరిచయమొనర్చువానిని చిత్రకారుడని, వాణివలన పరిచయమొనర్చువానిని కవియని యందుము. స్థాపత్యకారులుగూడ కళాధరులలో చేరుదురు. ఇట్లు ఉపకరణభేదమువలన సంగీతకళయని, నాట్యకళయని, చిత్రకళయని, కావ్యకళయని, స్థాపత్యకళయని పలువిధములగు కళలేర్పడుచున్నవి.

కళయందలి మర్మమును అందరు గ్రహింపజాలరు. సాధారణముగ రంగులను, తళుకుబెళుకులను చూచి భ్రమించువా రనేకులున్నారు. వారు యేది మనకండ్లకు నచ్చినది? ఏది అందముగనున్నది? ఏది నేత్రానందముగ నున్నది? యని చూతురు. ఆనందము సౌందర్యవిచారణ వారివారి స్వభావముల కనురూపముగనుండును. చిత్రకారులు, పత్రికాధిపతులు ప్రజాసేవయను పేరున కనిష్ట

రకపు చిత్రముల తయారుచేసి లాభముల గడించు చున్నారు. ఇట్టి చిత్రకళవలన సాధారణ జనులయం దెట్టి సంస్కారము గలుగకపోగా, వారి కళాభిరుచి నది పరి ష్కృత మొనర్పజాలకపోగా కళావికాసమునకు గూడ సాయపడదు. పాపము! వారికి తళుకుబెళుకులతో నిండిన యా చిత్రము లుత్తమములుకావని హృదయమున పవిత్ర భావోదయ మొదవించునవియే యుత్తమమగు చిత్తరువు లని వారికి తెలియదు. చూచుటతోనే ప్రవర్తనను బాగు పఱచునట్టి దేశసేవ, ప్రజాసేవ చేయ బుద్ధిపుట్టించునట్టి, పిరికితనమును పోద్రోలి పురుషార్థమును గుర్తింప జేయు నట్టి దుర్వ్యసనములను, దురాచారములను దూరము గావించి, సద్గుణముల నలవరింపజేయునట్టి ఉత్సాహము గలిగించునట్టివే యుత్తమమగు చిత్తరువులు. చిత్తరువుల యుత్తమ, నీచతలను నిర్ణయించుటకు వానిని చూచుట తోనే యుత్తమభావములు గలిగించునవి యుత్తమము లని, చెడుభావముల గలిగించునవి చెడ్డవిగను నిర్ణయించు కొనవలెను. స్త్రీల చిత్రపటముల చూచిన అందాసక్తి, అట్టివారు తనభార్యయైన బాగుండునను తలంపు పుట్ట గూడదు. చిత్రకారు డేయుద్దేశ్యములతో వానిని చిత్రిం చునో, వానియందాభావములు ప్రస్ఫుటములగుచుండును. చెడుభావములను ప్రకటించు చిత్రము లధమములు. చిత్ర కారు డేయుద్దేశముల చిత్రించవలెనన్నను తన కళాచాతు ర్యమువలన చిత్రించగలుగును. కాని వివేకముగల చిత్ర కారుడు సమాజమున కవసరములగు చిత్తరువుల చిత్రించి సంఘోన్నతికై కృషిసలుపును. సంఘోన్నతికి సాయపడు

చిత్రములనే కళాతత్వజ్ఞులుత్తమకళగ భావింతురు. మిగి లిన వానిని కళావిహీనములక్రింద లెక్కింతురు. సదా చారిని దేవునిగా తలంచి పూజించినట్లు, దురాచారి మానవుడేమైనను పశువుగతలంచునట్లు సంఘోన్నతికై సాయపడు కళను ఉత్తమముగను, దానిని చెడుమార్గ మున త్రిప్పువానిని హేయముగను చూచుటేగాక కళగా కూడ తలంపరు.

కళ భావమునకు సంబంధించినది. సౌందర్యము నకు సంబంధించినదిగాదు, రూపసౌందర్యములతో దానికి నిమిత్తములేదు. సౌందర్యోపాసకులు ప్రకృతికి ప్రతిలిపిని అనగా ఉన్నదున్నట్లు చిత్రించుటనే కళాకౌశలముగ భావింతురు. వారు కేవలము ప్రాకృతదృశ్యములనే చిత్రింపరు. ప్రకృత ప్రపంచమున కాన్పించు మానవుని నానావిధావస్థలను తారతమ్యము లేకుండ చిత్రింతురు. నగ్న, అర్థనగ్న చిత్రముల చిత్రించుటను వారు అనుచిత మని తలంచరు. వారు నిర్భయముగా దంపతులరహస్య గృహముల ప్రవేశింతురు. కవాటముల దూరముగావించి ఆచిత్రముల జనసాధారణమున కర్పింతురు. పత్రికలు పుట్టుటకుముందు అట్టి చిత్తరువులను అంతఃపురచిత్తరు వులుగా నెంచుచుండిరి. కాని గుప్తపద్ధతిని పాపముగ నెంచు యుగ మాసన్నమైనది. ఇంతవఱకు యెంతగ ప్రయత్నించియును స్త్రీల పరదాను తొలగించజాలక పోతిమిగాని చిత్రలేఖనప్రపంచమున అంతఃపురపు పర దాను తొలగించివైచితిమి. ఇతరుల అంతఃపురములలో నికి వెళ్ళి తొంగిచూచు సాహస మెవ్వరికైన నుండునా?

యని మనము సంశయింపవచ్చును. లేనిచో బజారులలో అంతఃపురరహస్యముల నమ్ము మహాశయులలో ఎవరైన యీప్రశ్నకు జవాబిచ్చియుండిరా? సోదరీమణులు తమను ఎచట బట్టినను, ఏస్థితిలో బట్టినను ఇట్లు చిత్రించుటేల అని ప్రశ్నించిరా? జరిగినదేదో జరిగినది, ఇకముందు మాత్ర మిట్లుచేయవలదని హెచ్చరించియుండిరా? ఇప్పటినుండియైనను సంఘ మిట్టి దుండగముల జరుగకుండ నరికట్టవలసియున్నది. అంతఃపురదంపతుల ఏకాంత జీవితచిత్రములకన్న చిత్రకారుల కన్యయేకాంతదృశ్యములు లభింపవా? అట్టివానితో వారు సమాజజీవితము నుద్ధరించి తమ కళను సార్థకపరచుకొనజాలరా?

ఇదియంతయు ప్రకృతికి ప్రతిలిపి కర్తల చరిత్ర. కళయనుపేర ప్రచలితములయిన వస్తువులను యదార్థదర్శకములని కళాతత్త్వవిదులు చెప్పుచున్నారు. ఇక మరియొక రకపు కళామర్మజ్ఞులున్నారు. వారు భావసౌందర్యోపాసకులు. రూపము క్షణికమని అతిగౌణమని వారు చెప్పుదురు. భావము వారి ముఖ్యవస్తువు. ప్రాకృతివస్తువుల చిత్రించుట యేమంతగొప్పపని? అది అభ్యాసమునకు సాధ్యమైన సులభకార్యము. అందు బుద్ధికల్పన ప్రతిఫలముతో నిమిత్తములేదని వీరితలంపు. భావసౌందర్యమునకు చిత్రకారుడు నూతనప్రపంచసృష్టిని చేయవలసియున్నది. అతడు తనహృదయమందలి భావవిశేషములకు విగ్రహరూపమును, చిత్రరూపమును కల్గించును. అట్టి చిత్రము ప్రాకృతవ్యక్తిగాక కరుణతోనో లేక భక్తి

తోనో మూర్తీభవించియుండును. భావప్రదర్శనమునకు తగిన అంగముల నాతడు తన ప్రతిభాసామ్రాజ్యము నుండి వెదకితెచ్చి ఒక ఆదర్శభావసృష్టి గావించును. అట్టివారిని ఆదర్శదర్శకానుగాములందురు.

ఆదర్శదర్శియగువాడు భావములకు వ్యక్తిరూపము నిచ్చును. యథార్థదర్శి ప్రకృతప్రపంచవ్యక్తుల చిత్రించి భావారోపణ గావింప యత్నించును. ఆదర్శచిత్రకారుని దృష్టి సమాజమును ఉన్నతపథగామిని గావించుటయందును, యథార్థదర్శి మంచిచెడ్డలను మర్యాదామర్యాదలను సంఘమునెదుట నుంచుటకును యత్నింతురు. ఆదర్శదర్శియగు చిత్రకారుడు వివేకముతో ఏర్చికూర్చి మంచివానిని సంఘమునెదుట నుంచును; యథార్థదర్శి స్వయముగా వివేకము నుపయోగించి తాను చిక్కులలో బడక మంచిచెడ్డల నిర్ణయించుభారము సంఘముపై బెట్టి అందాధిక్యత లభించినను, లభింపకున్నను వదలివేయును. తనకు నచ్చినవస్తువును సంఘమునెదుట బెట్టి తాను తప్పుకొనును.

భారతవర్షము స్వభావసిద్ధముగను, పరంపరానుగతముగను ఆదర్శవాది. పాశ్చాత్యనాగరికతవలన అన్యవిషయములందువలె మనము కళాదర్శమునుగూడ మరచితిమి. అవసానదశను పొందుచున్న భారతీయచిత్రకళను రక్షించినందునకు హైవెలునకు, అవనీంద్రఠాగూరునకును, డాక్టరు కుమారస్వామికిని మాధన్యవాదములు. భారతదేశమున నిపుడు వంగదేశసాంప్రదాయమని, బొంబాయి సాంప్రదాయమని చిత్రకళయందు రెండు శాఖలున్నవి.

రస్కిన్; టాల్‌స్టాయ్ ఆదర్శవాదులు. యూరపునందు కళ నశించిపోవుచున్నదని వారి యభిప్రాయము. టాల్‌స్టాయ్ (What is art?) కళయననేమి? యను గ్రంథమునురచించెను. అప్పటివరకు గల కళావిదులందరి యొక్క, సౌందర్యశాస్త్రజ్ఞులందరి యొక్కయు ఉద్దేశ్యముల నుదాహరణముగా తీసికొని వానిని విమర్శించి కళలనుగూర్చి తన స్వతంత్రాభిప్రాయమును విశదీకరించెను. ఈవ్యాసప్రారంభమున కళలనుగూర్చి చేసిన వ్యాఖ్య ఆయనభావముల ననుసరించి గ్రహింపబడినది.

ఈవ్యాసమువలన చదువరులకు చిత్రములయందు మంచిచెడ్డల నిర్ణయించుశక్తిగలిగి తద్వారా జీవితమును, ధన్యత గావించుకొనగలరని తలంతును.

---

# విషయసూచిక




ఆంధ్రభూమి ముద్రణాలయము — వేపేరి, మదరాసు.

